“అత్యవసర పరిస్థితి - అనుశాసన పర్వం”

—ఆచార్య వినోబా భావే

# కొత్త లాభాలు

ప్రతి జాతీయ కార్యకలాప రంగంలో ప్రస్ఫుటమైన అభివృద్ధి

- అత్యవసర వస్తువుల ధరలు తగ్గాయి.
- ఉత్పత్తి పెరిగింది. మరింత విద్యుచ్ఛక్తి.
- పారిశ్రామిక సంబంధాలు మెరుగు పడ్డాయి.
- సమ్మెలు, లాకౌట్లు, బంద్‌లు అదృశ్యం
- నేరాలు, దౌర్జన్యం, ఇతర సమాజ వ్యతిరేక కార్యకలాపాలు ప్రస్ఫుటంగా తగ్గాయి.
- ఆఫీసులలో వేళలని పాటించడం, శక్తిసామర్థ్యాలు.
- ప్రజలు మరింతగా కష్టించి పనిచేస్తున్నారు.
- అధికనోట్ల పరిస్థితి రేటు 1974 ఏప్రిల్‌లో 30.1% ఉండగా, 1975 జులై 19వ తేదీ నాటికి –2.1%కి తగ్గింది.
- రైతులకి మరింతగా మెరుగైన వ్యవసాయ ఉత్పత్తి సాధనాలూ, ఋణ సదుపాయాలు.

- ప్రభుత్వ పంపిణీ వ్యవస్థని కట్టుదిట్టం చేశాం.
- అన్నిరాష్ట్రాలకి తగినంతగా కిరసనాయిలు సప్లయి
- కంట్రోలు వస్త్రం ఉత్పత్తి 1974లో 100 మిలియన్ చదరపు మీటర్లు కాగా, ఈ ఏడాది 160 మిలియన్ చదరపు మీటర్లకి పెరుగుతుంది.
- ఏటా కొత్తగా 2.5 లక్షల మందికి వంటకి గ్యాస్ సౌకర్యం లభిస్తుంది.
- 117 అత్యవసర మందుల ఉత్పత్తి పెంచుతారు.
- చేరుకోడానికి కష్టమయిన, కొండ ప్రాంతాలలో సిమ్మెంటు, తక్కువ ధరకి లభిస్తుంది.
- మధ్య తరహా ఆదాయ వర్గాలవారికి పన్నుల మినహాయింపు.
- క్రమశిక్షణా భావం మరింతగా పెరిగింది.

శ్రీమతి ఇందిరా గాంధి ప్రకటించిన

## 20 అంశాల కార్యక్రమం

అమలు జరపడంలో సహాయ పడండి

**కష్టించి పనిచేయండి, ఎక్కువ ఉత్పత్తి జరపండి, క్రమశిక్షణ కాపాడండి.**

davp 75/210



రామ్ శ్యామ్‌లకు హైజాకర్‌తో భేటీ
రామ్, శ్యామ్‌లకు మళ్ళీ సెలవుల హుషారు
విమానంలో బయల్దేరారీసారి షికారు.
అమ్మో! విమానాల దారి మళ్ళించే మొనగాడు– చేత తుపాకీతో హాజరు అయినాడు
వెళదాం ఆ దురాంతకుని వెనకే మనం, చేద్దాం మరి చేతనైతే సాయం పాపం.
మొనగాని వీపుపై తుపాకీ వున్నట్లయినది, మన రామ్ పెట్టిన పాపిన్స్ ప్యాకే మరి అది.
అంతే, అదిరిపడ్డాడు అతగాడు, పైలెట్ తుపాకీ లాగేశాడు, మరో దారిలేని మొనగాడు కాలికి బుద్ధి చెప్పేశాడు.
రామ్, శ్యామ్‌లే రక్షించారు ఆరోజు
'పాపిన్స్ హీరో' అని మెచ్చారు అందరు ఆరోజు!






PARLE
POPPINS
MIXED FRUITY SWEETS

# టినోపాల్* ఇప్పుడు ఓ కొత్త పేరుతో

# రానిపాల్+



రానిపాల్+
నూలు దుస్తులకు




రానిపాల్+ఎస్
సింథెటిక్ మరియు
మిశ్రమ దుస్తులకు.




ఉత్పాదన అదే, పనితనం అదే, కాని పేరు మాత్రం కొత్తది.

## సర్వోత్తమ తెలుపు కోసం రానిపాల్+

**Suhrid Geigy**
LIMITED

Shilpi SGT 6A/76 tel

+ సుహృద్ గైగి లిమిటెడ్ వారి ట్రేడ్ మార్క్ * ఇంతకు పూర్వం సీబా-గైగి లిమిటెడ్ వారి లైసెన్సు క్రింద అమ్మబడేది.




సురేష్ మూవీస్

# సెక్రటరీ

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత:
డి.రామానాయుడు

దర్శకత్వం:
కె.యస్.ప్రకాశరావు

ఆంధ్ర:
నవయుగ

నైజాం:
చక్రవర్తి పిక్చర్స్

సీడెడ్:
విజయా సురేష్ పిక్చర్స్

కర్ణాటక:
గోకుల్ కంబైన్స్




**List of Prize Winners of Chandamama-Camlin Colouring Contest No. 1**

*1st Prize*: Kadi Venkata Sathyanarayana, Mori. *2nd Prize*: Kandula Mytholi, Vijayanagaram. *3rd Prize*: K. Kumar Raja, Vizianagaram. *Consolation Prizes*: B. Srinivas Das, Hyderabad. K. S. Sunanda, Madras. P. Kumarswamy, Koratla. G. Manoj Kumar, Hyderabad, B. Venkata Ramana, Hyderabad. *Merit Certificates*: Chavan Narsing Rao, Hyderabad. Korada Srinivasa Rao, Palakollu. Lanka Prasad, Visakhapatnam. Y. Naga Maani, Korutla. B. Lakshmi Narasimha Das, Hyderabad. A. Chandra Mohan, Korutla. T. V. S. S. Nagamani, Anakapalli. K. V. Nageshwar Rao, Cuddapah. V. Srinivas, Calcutta. N. Uday Bhaskar Rao, Hyderabad.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["బలిఅయిన సన్యాసి]" ఖైరి సత్యనారాయణ రచన. జీవితంలో అనేక రకాల దృక్పథాలుగల వాళ్ళుంటారు. పరస్పరం ఎలాటి సంబంధమూ లేని దృక్పథాల మధ్య వైరుధ్యం ఏర్పడినప్పుడు లౌకికదృక్పథం నెగ్గుతుంది. ఈ కథలో మనం ఇదే చూస్తాం.

జీవితంలో అతి ముఖ్యమైన పాత్ర వహించే వారి కన్న ఆశ్రయింపు వల్ల అనామకులు ఎలా బాగుపడతారో "రాజుగారి ప్రాపకం" తెలుపుతుంది.

సంపుటి 62 జూన్ '76 సంచిక 6

A CHANDAMAMA PUBLICATION

CHITRA



# మిత్రసమాప్తి

## 36

అది మొదలు కాకి, ఎలుకా రోజూ కలుసుకుని, చర్చలతో మహా సంతోషంగా కాలం గడుపుతూ వచ్చాయి. అవి పరస్పరం సహకరించేవి కూడా. యజ్ఞాలు చేసిన చోట మిగిలిపోయిన మాంసమూ, అన్నం మెతుకులూ తెచ్చి కాకి ఎలుకకు ఇచ్చేది. అలాగే ఎలుక, తాను రాత్రివేళ సేకరించిన బియ్యమూ, ఇతర తినుబండారాలూ కాకికి పెట్టేది. ఇలాటి ఇచ్చి పుచ్చుకోవటాలతో రెంటి మధ్యా మైత్రి దృఢమయింది. ఇచ్చి పుచ్చుకోవటాలు లేని స్నేహమంటూ ఉండదు గదా! దేవతలు సైతం మొక్కులు చెల్లిస్తేనేగాని కోరికలు తీర్చరు. ఇవ్వటం ఉన్నంత కాలమే మమకారం ఉంటుంది. తల్లి దగ్గిర పాలురావటం నిలిచిపోగానే దూడ తల్లిని వదిలేస్తుంది. అలా కాకుండా, ఇవ్వటం ద్వారా శత్రువును మిత్రుడుగా చేసుకోవచ్చు. జంతుజాతిలో ఇచ్చేగుణం కడుపుతీపి కన్న హెచ్చయినది. గేదె తన దూడ ఉండగానే, తన పాలను ఎలాటి దుర్మార్గుడికైనా ఇచ్చేస్తుంది. సహజశత్రువులై ఉండి కూడా, ఎలుకా, కాకీ దృఢస్నేహంలో బంధింపబడిపోయి. సరదాగా చర్చలు జరుపుకుంటూ వచ్చాయి.

అంతలో ఒకనాడు, కాకి ఎలుక వద్దకు వచ్చి, కన్నీరు పెట్టుకుంటూ, గద్గద స్వరంతో, "ఓ, హిరణ్యకా! మనకు త్వరలోనే ఎడబాటు రానున్నది. నేను ఈ దేశం విడిచి పోవలిసివచ్చింది," అన్నది.

"ఏం?" అని ఆశ్చర్యపోతూ హిరణ్యకం అడిగింది.

"దేశంలో భయంకరమైన నీటి కరువు ఏర్పడింది. ప్రజలు మాడిపోతున్నారు.

అట్ట చివరి బొమ్మ



యజ్ఞాలు నిలిచిపోయాయి. వాటి మూలానె నాకు మంచి ఆహారం దొరికేది. ప్రజలు ఆకలిబాధకు తట్టుకోలేక అడ్డమైన పక్షులన్నిటినీ పట్టుకుని తింటున్నారు. ఏ ఇంట చూసినా పట్టుబడిన దౌర్భాగ్యపు పక్షులే కనబడుతున్నాయి. వాటిని చూస్తే నా గుండె తరుక్కుపోతున్నది. నేను కూడా పట్టుబడి, ఎలాగో ప్రాణాలతో తప్పించుకున్నాను. అందుకే నేను వెంటనే దేశం విడిచి వెళ్ళ నిశ్చయించాను," అన్నది కాకి.

"ఎక్కడికి పోదామనుకుంటున్నావు?" అని ఎలుక అడిగింది.

"దక్షిణ దేశంలో ఒక మహారణ్యం మధ్య ఒక పెద్ద సరస్సు ఉన్నది. అక్కడ నాకు నీకన్న కూడా ఆత్మీయుడైన స్నేహితుడు మంథరకం అనే తాబేలు ఉన్నది. అది నాకు చేపమాంసం ఇస్తుంది. ఆ మాంసం తింటూ, దానితో గోష్ఠి జరుపుతూ సుఖంగా ఉంటాను. ఇక్కడే ఉండి, పక్షిజాతి బంధించబడటమూ, చావటమూ చూడలేను. ప్రయాణం దుర్ఘటం కాదా, అంత దూరప్రాంతానికి వెళ్ళటం వాంఛనీయమా అని నువ్వు అడగవచ్చు. కాని సమర్థులకు చేయరానిదీ, పట్టుదల ఉంటే సాధించరానిదీ, జ్ఞానవంతుడికి పరదేశమూ, సాధుగా మాట్లాడే వాడికి విజాతీయుడూ అంటూ ఉండదు గదా! దేశం కరువు వాతపడి, పంటలు మాడిపోతూ ఉన్నప్పుడు, తమ కుటుంబాలు నాశనం కావటమూ, దేశం దుర్భిక్షం పాలు కావటమూ చూడకుండా ముందుగా దాటిపోయే వాళ్ళు ధన్యులు," అన్నది కాకి.

"అలా అయితే, నేను కూడా వస్తాను. ఇక్కడే ఉండిపోవటం నాకూ క్షేమం కాదు," అన్నది ఎలుక.

"ఎందుచేత?" అని కాకి అడిగింది.

"అది పెద్ద కథలే. మనం సరస్సు చేరుకున్నాక చెబుతాను." అన్నది ఎలుక.

"నేను ఆకాశంలో ఎగిరే పక్షిని. నువ్వు నేలను అంటి పెట్టుకుని ఉండే ప్రాణివి. మనం కలిసి ఎలా ప్రయాణించగలం?" అని కాకి అడిగింది.

"నువ్వు నా ప్రాణాన్ని కాపాడదలుచుకుంటె, నన్ను నీ వీపు మీద ఎక్కించుకుని, సరస్సు వద్దకు ఎగిరి వెళ్ళు. అంతకన్న మార్గం లేదు." అన్నది ఎలుక.

"సంతోషంగా ఆ పని చేస్తాను. నా అదృష్టం! ఇద్దరు స్నేహితులతో నాకు సరస్సు వద్ద మరింత ఆనందంగా కాలక్షేప మవుతుంది," అన్నది కాకి.

హిరణ్యకం కాకి వీపు మీదికి ఎక్కింది. కాకి తొట్రుపడకుండా, అతి తేలికగా సరస్సు వద్దకు ఎగిరి వెళ్ళింది.

మంథరకం బహు జాగరూకతగల ప్రాణి. అది, ఎలుకను వీపు మీద ఎక్కించుకుని వస్తున్న కాకిని చూసి, "ఇదేదో వింత కాకి లాగున్నది. మనం తప్పుకుందాం," అనుకుని, నీటిలో మునిగింది.

కాకి ఎలుకను ఒక చెట్టు కింది కలుగు దగ్గిర దించి, చెట్టుకొమ్మ చివరన వాలి, "మంథరకా, త్వరగా రా. నేను నీ మిత్రుణ్ణి, లఘుపతనకాన్ని. ఆర్తితో వచ్చాను. అందుచేత, వచ్చి నన్ను కౌగలించుకో." అని గట్టిగా కేక పెట్టింది.

తాబేలు ఆనందబాష్పాలు రాల్చుతూ, వేగంగా కొట్టుకుంటున్న గుండెతో ఒడ్డుకు వచ్చి, "మిత్రమా, నీ కౌగిలి ఇయ్యి. మనం కలుసుకుని ఎంతో కాలం కావటం వల్లా, నువ్వు చాలా మారిపోయి ఉండటం వల్లా నిన్ను పోల్చలేకపోయాను. అందుకే నీటిలో దాక్కున్నాను." అన్నది.

కాకి చెట్టు మీది నుంచి కిందికి దిగి తాబేలును కౌగలించుకున్నది.

చాలా కాలానికి తిరిగి కలుసుకున్న మిత్రులు మధ్యకాలంలో కలిగిన తమ అనుభవాలను గురించి ముచ్చటించుకుంటూంటె, ఎలుక వచ్చి తాబేలుకు సాష్టాంగ నమస్కారం చేసి, కాకి సమీపంలో కూర్చున్నది.





# మాయాసరోవరం

## 6

[జయశీలుడూ, సిద్ధసాధకుడూ కలిసి, రాజుగారి నౌకరు వెంట అరణ్యానికి వెళ్ళి, అక్కడ ఒక ఊడలమఱ్ఱి కింద బోయవాణ్ణి, మంత్రం వేస్తున్న దయ్యాలపోతునూ చూశారు. బోయవాడు తనకు విరిగిన కత్తీ, ముత్యాలహారం దొరికిన రేగుపొద వాళ్ళకు చూపించాడు. ఆ పొదలో సిద్ధసాధకుడికి ఒక పురాతన తాళపత్ర గ్రంథం కనిపించింది. తరవాత—]

సిద్ధసాధకుడు రేగుపొదలో కనిపించిన తాళపత్ర గ్రంథాన్ని చూసి, అంతగా ఆవేశపడిపోవటం, జయశీలుడికి ఆశ్చర్యం కలిగించింది. కాని సాధకుడు మాత్రం గ్రంథంలోని పత్రాలను ఒక్కొక్కదాన్నే తిప్పి చూస్తూ "ఇదెక్కడి భాష? ఏ లోకం వాళ్ళు మాట్లాడేది? అసలీ పత్రాలు కూడా తాటిఆకుల నుంచో, భూర్జపత్రాల నుంచో తయారు చేసినవి కాదు. బాగా మందంగా వుండే తామరఆకుల నుంచి కత్తిరించినట్టుగా వున్నది." అన్నాడు.

"సాధకా ఆ పత్రాల మీద రాసివున్న భాష కూడా నువ్వు ఎరిగినది కాదా?" అని అడిగాడు జయశీలుడు.

సిద్ధసాధకుడు తల అడ్డంగా తిప్పి, "ఇది ఏ దేవభాషో లేక రాక్షసభాషో అయివుంటుంది. వాళ్ళ సహాయంతో



మాత్రమే చదవగలం! లేక కనకాక్ష రాజుగారి కొలువులో వుండే పండితులెవరికైనా తెలుసునేమో చూడాలి.'' అన్నాడు.

జయశీలుడు సాధకుడి నుంచి గ్రంథాన్ని తీసుకుని అటూయిటూ తిప్పి చూసి, ''దీన్ని యీ బోయవాడు చెప్పే ఆ రెండు కాళ్ళ మొసలే యిక్కడ జారవిడిచి వుండాలి! కాని యువరాజూ, యువరాణుల జాడ తెలుసుకునేందుకు యిది ఏ మాత్రం సహాయపడదు.'' అంటూ తాళపత్ర గ్రంథాన్ని దాపులనున్న పొదల్లోకి విసిరివేశాడు.

సిద్ధసాధకుడు అది చూసి, పెద్దగా కేక పెట్టి, ''జయశీలా, అదేం పని? ఆ గ్రంథంలో వున్నవి, ఏవో మంత్రాలు అయి వుంటవి. వాటిద్వారా మహాకాలుణ్ణి వశం చేసుకోవచ్చునేమో. ఎవరు చూశారు!'' అంటూ పరిగెత్తిపోయి, పొదలలో నుంచి తాళపత్ర గ్రంథాన్ని బయటికి లాగి, జయశీలుడి దగ్గిరకు తిరిగి వచ్చాడు.

జయశీలుడు కోపంగా సిద్ధసాధకుణ్ణి, ''మనం యిక్కడికొచ్చింది మహాకాలుణ్ణి ప్రత్యక్షం చేసుకునేందుకా, లేక కనకాక్ష రాజుగారి పిల్లల ఆచూకీ తెలుసుకునేందుకా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నతో సాధకుడు వెలవెలపోయి, ''జయశీలా, కోపగించకు. నేనీ బోయ భీముడి ద్వారా, ఆ రెండు కాళ్ళ మొసలి సంగతేదో తెలుసుకుంటాను. వాడే యువరాజునూ, యువరాణినీ అపహరించుకుపోయి వుండాలి.'' అన్నాడు.

''వీడో మతిలేని వెధవ! రెండు కాళ్ళ మొసలి ఏమిటి? నాలుగు కాళ్ళ మనిషిలాగా!'' అన్నాడు జయశీలుడు విసుగుపడుతూ.

సిద్ధసాధకుడు, బోయవాడి భుజం తట్టి, ''ఒరే అబ్బీ! నీ కొచ్చిన భయం లేదు. ఆ రెండు కాళ్ళ మొసలి యిక్కడికెందుకు వచ్చాడు? నిన్నేమడిగాడు?'' అని ప్రశ్నించాడు.




బోయవాడు భయంతో దిక్కులు చూస్తూ, "దొరా, వాడు నన్ను పలకరించటం, నేను జవాబు చెప్పి యింకా బతికి వుండటం కూడానా? నేను రేగుపొదలో పడ్డ అడవి కోడిని ముళ్ళు గుచ్చుకోకుండా సుతారంగా బయిటికి లాగేందుకు, మోకాళ్ళ మీద వంగాను. ఇంతలో వెనక శబ్దమైంది. తల తిప్పి చూతునుగదా, అంత పొడుగున, ఒళ్లంతా మొసలిలా గగ్గులు గగ్గులుగా వున్న ఆకారం కంటబడింది. వెంటనే నేను ఒక చావు కేక పెట్టి, నేల మీద పడిపోయాను. తరవాత ఏం జరిగిందీ నాకు తెలియదు," అన్నాడు.

"నువ్వు బాణంతో కొట్టిన అడవికోడి మాటేమిటి?" అన్నాడు జయశీలుడు.

"దాన్ని కొండ దేవత ఎత్తుకుపోయి వుంటుంది. తెల్లవారుజామున కోడిని కొట్టి వీడు అపచారం చేశాడు. అందుకే వీణ్ణి ఆ కొండదేవత నెత్తణిచింది." అన్నాడు దయ్యాలపోతు పళ్లు కొరుకుతూ.

జయశీలుడు వాడి కేసి కోపంగా చూసి, సిద్ధసాధకుడితో, "ఇక్కడంతా వెకిలి వెధవలు చేరినట్టుంది. ఇప్పుడు మనం ఏం చేద్దాం? ఎలాంటి శుభవార్తా కనకాక్ష రాజుగారికి చేప్పేందుకు లేదు కనక, మనం యిప్పుడే నగరానికి తిరిగిపోవటం అర్థంలేని పనవుతుంది. మనం యీ చుట్టుపక్కల వున్న కొండల్లో, లోయల్లో కనీసం ఒకవారం రోజులపాటైనా తిరిగి, ఆ దుర్మార్గుడి జాడ లేమైనా తెలుసుకోగలమేమో చూద్దాం," అన్నాడు.

"ఇది మంచి యోచన, జయశీలా!" అని సిద్ధసాధకుడు జయశీలుణ్ణి మెచ్చుకుని, తాళపత్ర గ్రంథం ఆకులను రెండు మూడు సార్లు తిప్పిచూసి, "జయశీలా! యీ గ్రంథాన్ని యిక్కడ పోగొట్టుకున్నవాడే యువ, యువరాణుల్ని ఎత్తుకుపోయినవాడైతే మాత్రం—వాడు తప్పక రాక్షసజాతివాడో, కిన్నెర, గంధర్వజాతివాడో అయివుంటాడు," అన్నాడు.



"అంతేకాని, సాధకా! అయినా మనం అలాంటి వాళ్ళను నా కత్తి బలంతో, నీ మంత్రశక్తితో ఓడించి, యువరాజునూ, యువరాణినీ తిరిగి తెచ్చి, కనకాక్షరాజు గారికి ఒప్పచెపుతాం." అన్నాడు జయశీలుడు.

తరవాత యిద్దరూ కలిసి దాపులనున్న కొండల కేసి బయలుదేరారు. వాళ్ళ వెంట నగరం నుంచి వచ్చిన రాజుగారి నౌకరు, వాళ్ళను, "అయ్యా, రాజుగారికి ఏమని చెప్పమన్నారు?" అని అడిగాడు.

జయశీలుడు జవాబు చెప్పబోయేంతలో సిద్ధసాధకుడు అందుకుని, "ఒరే, రాజు గారికి యీ శుభవార్త చెప్పు! ఆయన పిల్లలు అపహరించబడిన ఊడల మర్రి దగ్గిర, ఒక మహోద్గ్రంథం దొరికిందనీ దాని సాయంతో త్వరలోనే యువరాణీ, యువరాజులను ఎత్తుకుపోయిన దుష్టులను సంహరించి, వాళ్ళను క్షేమంగా ఇంటికి తేగలమనీ తెలియబరుచు," అన్నాడు.

ఈ మాటలకు జయశీలుడు తనలో తాను నవ్వుకున్నాడు. ఇద్దరూ దట్టమైన చెట్లతో కప్పబడిన కొండ కేసి పోసాగారు.

ఆ సమయంలో అక్కడికి అమడదూరంలో, కొండ దిగువనున్న ఒక కుగ్రామంలో, గ్రామస్థులంతా వీధుల్లో చేరి, భయకంపితులైపోతూ, ఏమి చేయటమా అని గొడవ గొడవగా చర్చించుకుంటున్నారు.

ఈ గగ్గోలు కంతకూ కారణమైన సంఘటన, అనాటి ఉదయాన, గ్రామానికి దూరంగా వున్న జొన్న చేల దగ్గిర జరిగింది. ఆ చేలల్లో ఒక చోట మంచె వున్నది. ఆ మంచె మీద కూర్చుని చేల కాపలా కాస్తున్న, ఒక పధ్నాలుగేళ్ళ కాపుకుర్రవాడికి దూరంగా చేల కేసి వస్తున్న ఏనుగు ఒకటి కనిపించింది. ఏనుగును వడిశెల దెబ్బతో తరమటం సాధ్యంకాదని వాడికి తెలుసు. కాని, అది ఒకసారి పంట చేనులో ఫడిందో, పావుగంటలో ఎకరం పంట సర్వనాశనం అయిపోతుంది.



కాపు కుర్రవాడు వయసుకు మించిన ధైర్యశాలి. మొదట్లో వాడు మంచె దిగి, గ్రామానికి పరిగెత్తి, సంగతి పెద్దవాళ్ళకు చెపుదామనుకున్నాడు. కాని వడిశెల రాళ్ళు ఒకటి రెండు ఏనుగు కేసి విసిరితే, ఒకవేళ అది వెనుదిరిగి అరణ్యంలోకి పోతుందేమో అన్న ఆశ వాడికి కలిగింది.

ఇలాంటి ఆలోచన రాగానే కాపు కుర్రాడు, వడిశెలలో మంచి కరకురాయి ఒకటి పెట్టి, ఏనుగు కేసి గురిగా విసిరాడు. రాయి పోయి రపీమంటూ ఏనుగుకు తగిలింది. ఆ దెబ్బకు ఏనుగు ఘీంకరించటానికి బదులుగా, ఒక వింత ఆకారం ఏనుగు మీద లేచి కూర్చుకుని, "ఒరే, ఎవడురా, ఆ రాయి విసిరింది? నేనెవరనుకున్నావు?" అంటూ భయంకరంగా హుంకరించింది.

ఆ హుంకరింపుతో కాపు కుర్రాడి పై ప్రాణాలు పైనే పోయినంతపని జరిగింది. వాడు గడగడ వణికిపోతూ, మంచె నుంచి కిందికి దూకి పారిపోవాలనుకుంటూనే, కాళ్లూ, చేతులూ స్వాధీనంలో లేనందున, ఆ పనిచేయలేక, మంచె మీదే స్థాణువులా నిలబడిపోయాడు.

ఒకటి రెండు క్షణాల్లో ఏనుగు మంచెను సమీపించింది. ఆ ఏనుగు మామూలు ఏనుగులా లేదు. దాని శరీరం అంతా చేపపొలుసులతో కప్పబడినట్టువున్నది. దాని మీద కూర్చున్నవాడు తలకు మొసలి తల ఆకారంలోవున్న శిరస్త్రాణం ధరించి వున్నాడు. వాడి శరీరాన్ని మొసలి చర్మం కప్పివున్నది.

ఈ వికృతాకారుడు, కాపు కుర్రాణ్ణి సమీపించి, అభయం యిస్తున్న వాడిలా చేయెత్తి, "ఒరే, నీకొచ్చిన భయం ఏమీ లేదు. నే చెప్పినట్టు చెయ్యి. నువ్వు గ్రామానికి పోయి నాకు మంచి ఆహారం తీసుకురా. దానితోపాటు మీ గ్రామంలో మంచి వైద్యుడుంటే, వాణ్ణి కూడా వెంటబెట్టుకురా. బాగా శస్త్రచికిత్స తెలిసిన వాడైతే ఉపయోగం. ఇటు చూడు!



వెక్కలో దిగి, విరిగిపోయిన యీ కత్తిని ఉపాయంగా బయిటికి లాగి, ప్రాణం పోకుండా కాపాడాలి. మీ ఇద్దరికీ ప్రతి ఫలం వుంటుంది,'' అన్నాడు.

కాపు కుర్రాడు నిలువెల్లా వణికిపోతూ, ఆ వికృతాకారుడు చెప్పినదంతా విన్నాడు. కాని, వాడికి మంచె దిగటానికి ధైర్యం చాలలేదు. అది గ్రహించిన వికృతాకారుడు ముందుకు వచ్చి, కాపు కుర్రాణ్ణి నడుం పట్టుకుని పైకెత్తి, ఏనుగు మీదికి దించి, తరవాత చేతులు రెండూ పట్టుకుని నేల మీదికి జార్చాడు.

కాళ్ళు రెండూ నేలను తాకగానే కాపు కుర్రాడికి నూరు ఏనుగుల బలం వచ్చి నట్టయింది. వాడు యమకింకరుడి పట్టు నుంచి బయటపడినవాడిలా కీచుమంటూ ఒక కేకపెట్టి, సుడిగాలిలా జొన్నచేలకు అడ్డంపడి పరిగెత్తుతూ, కొద్దిసేపటికల్లా గ్రామం చేరాడు.

ఆ సమయంలో గ్రామ మధ్యంలోని వేపచెట్టు కింది రచ్చబండ మీద గ్రామస్థులు కొందరు కూర్చుని, పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. పరుగెత్తుకుంటూ వస్తున్న కాపు కుర్రాణ్ణి చూస్తూనే వాళ్ళు, జొన్నచేల మీదికి ఏ అడవి పందుల గుంపో, లేళ్ళ మందో వచ్చిపడి వుంటుందనుకుని,'' ఒరే, చిన్నా! ఏం జరిగింది? ఎందుకలా పరిగెత్తుతున్నావు?'' అని అడిగారు.

చిన్నడు ఆగి రొప్పుతూ, తడబడే మాటల్తో జొన్నచేల దగ్గిర జరిగిందంతా చెప్పాడు. గ్రామస్థుల్లో ఎవరికీ వాడి మాటల మీద నమ్మకం కలగలేదు. వాడికేదో మతిభ్రమ కలిగి వుంటుందని కూడా కొందరనుకున్నారు. కాని, ఆ సమయంలో అక్కడికొచ్చిన ఊరి గణాచారి, గ్రామ పెద్ద ద్వారా సంగతంతా విని, '' చిన్నా చెప్పింది, అంత అబ్బురమైన సంగతేం కాదు. నేను గణం పూనినప్పుడు ఇలాంటి నీటి ఏనుగుల్ని, మొసలి మనుషుల్నే కాదు—రెండు తలల సింహాలనూ,

పది తలలు గల వింతమనుషుల్ని కూడా చూస్తూ వుంటాను.'' అన్నాడు.

''అయితే, యిప్పుడు మనం ఏం చెయటం? మననందర్నీ చంపేందుకు. ఆ రాక్షస జాతివాడు ఏదన్నా పన్నాగం పన్నాడేమో!'' అన్నాడు గ్రామపెద్ద.

అక్కడినుంచి నలుగురూ గుమిగూడి, చర్చలూ, వాదులాటలూ ప్రారంభించారు. ''వాడి దేహంలో ఏదో కత్తి దిగి వున్నది. వాడు ఆహారంతో పాటు వైద్యసహాయం కూడా కోరుతున్నాడు. మనం, మన చరకాచారిని వెంటబెట్టుకు పోవటం బావుంటుంది.'' అని సలహా యిచ్చాడొకడు. గుంపులో వున్న గ్రామవైద్యుడు చరకాచారిని చూపుతూ.

చరకాచారి భయంతో కంపించిపోతూ, ''ఈ వికృతాకార రాక్షసుడికి నేను వైద్యం చేయటమా? పైగా అది శస్త్ర చికిత్స తెలిసినవాడు చేయవలసిన పని. మన, మంగలి వీరనారాయుణ్ణి పిలిపించండి. వాడు రాక్షసుడి డొక్కలో నుంచి కత్తి లాగింతరవాత రక్తస్రావమై చావకుండా, నేను మందులిచ్చి, వాణ్ణి కాపాడగలను.'' అన్నాడు.

ఒకరిద్దరు పోయి జనంలో వున్న వీర నారాయుణ్ణి తీసుకొచ్చారు. అతడూ ఒక చావుకేకపెట్టి, ''ఆ మొసలి రాక్షసుడిని తాకి, శరీరం నుంచి కత్తి లాగే శక్తి నా కున్నదనుకుంటున్నారా?'' అన్నాడు.

''ఉన్నదో లేదో....ముందు అందరూ కదలండి. ఎందుకైనా మంచిది, ఆయుధాలు కూడా వెంటబెట్టుకు రండి. చిన్నా చెప్పిన మాటల్లోని నిజానిజాలు జొన్న చేల దగ్గిర రుజువవాల్సిందే!'' అన్నాడు గ్రామపెద్ద.

జనం గుంపులుగా, కర్రలూ, కత్తులూ, గొడ్డళ్ళూ పట్టుకుని తానున్న చోటుకు రావటం చూస్తూనే, ఏనుగు మీది వికృతాకారుడు, ఏనుగును గట్టిగా అదిలించాడు. ఏనుగు తొండం ఎత్తి పెద్దగా ఘీంకరిస్తూ, గ్రామస్థుల కేసి దూకుతూ రాసాగింది. —(ఇంకా వుంది)






# బలిఅయిన సన్యాసి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, పొరపాటున కూడా నువు దుష్టుడికి సహాయం చెయ్యకు. దొంగకు సహాయ పడిన సన్యాసి తన ప్రాణాలే పోగొట్టుకున్నాడు. శ్రమ తెలియకుండా ఉండగలందులకు ఆ సన్యాసి కథ చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం ఒక రాజు ఏలే పట్టణానికి ఒక రోజున ఒక సన్యాసి వచ్చి, ఊరి చివరన గల దేవాలయంలో బసచేశాడు. ప్రజలు ఆ సన్యాసిని చూడటానికి వెళ్ళి, ఆయనకు తమ కష్టసుఖాలు చెప్పుకున్నారు. సన్యాసి అనేక మందికి వాళ్ల సమస్యలు తీరే మార్గాలు చెప్పాడు.

## బేతాళ కథలు



ఒక రోజు చీకటి పడేవేళ ఒక దొంగ వాడు సన్యాసి వద్దకు వచ్చి, "స్వామీ, నేను ఈ రాత్రి ఒక ముఖ్యమైన పని తల పెట్టాను. అందుకు తగిన సమయం చెప్పారంటే, అందువల్ల వచ్చే ప్రతి ఫలంలో సగం మీకు యిచ్చుకుంటాను," అని సన్యాసి కాళ్ళమీద పడ్డాడు.

సన్యాసి కొంతసేపు ఆలోచించి, ఫలాని సమయానికి పని ప్రారంభించమని దొంగకు చెప్పాడు. దొంగ ఆ రాత్రి సన్యాసి చెప్పిన వేళకు ఒక ధనవంతుడి ఇంట ప్రవేశించి, ధనం తస్కరించాడు.

మర్నాడు ఉదయం దొంగ సన్యాసి వద్దకు వెళ్ళి, "స్వామీ, మీ దయవల్ల రాత్రి నేను తలపెట్టిన పని విజయవంత మయింది," అని కొంత డబ్బు సన్యాసి ముందుపెట్టాడు. సన్యాసి ఆ ధనాన్ని బీద సాదలకు పంచిపెట్టేశాడు.

కొన్ని రోజుల అనంతరం ఆ దొంగ మళ్ళీ సన్యాసి వద్దకు వచ్చి, కిందటి సారిలాగే, తాను ఆ రాత్రి ఒక పని తల పెట్టాననీ, అందుకు తగిన సమయం చెప్పమనీ కోరాడు. సన్యాసి మళ్ళీ ఆలో చించి, ఏదో సమయం చెప్పాడు.

ఆ వేళకు దొంగ తిన్నగా రాజుగారి ధనాగారంలోకి జొరబడి, తాను మొయ్య గలిగినన్ని మొహరీలు తస్కరించి, వాటిలో సగం తెచ్చి సన్యాసికి ఇచ్చేశాడు.

సన్యాసి ఆ మొహరీలను బిచ్చగాళ్ళకు దానం చేశాడు. మర్నాడే బిచ్చగాళ్ళ దగ్గిర రాజుగారి మొహరీలుండటం గమ నించిన రాజభటులు, వాటిని సన్యాసి పంచినట్టు రాజుగారికి చెప్పారు.

రాజుగారు వెంటనే సన్యాసిని రప్పించి, "నువు బిచ్చగాళ్ళకు మొహరీలు పంచి పెట్టావా?" అని అడిగాడు.

"ఔను!" అన్నాడు సన్యాసి.

"నీ కా మొహరీలు ఎక్కడివి?" అని రాజు సన్యాసిని అడిగాడు.

సన్యాసి సమాధానం చెప్పక మౌనంగా వుండిపోయాడు.

''సన్యాసి వేషం వేసుకుని దొంగ తనాలు చేస్తున్నావన్న మాట?'' అన్నాడు రాజు. దానికి సన్యాసి సమాధానం చెప్పలేదు.

''వీడి తల తీసెయ్యండి.'' అని రాజు తన భటులకు ఉత్తరువు ఇచ్చాడు. రాజ భటులు సన్యాసికి శిరశ్ఛేదం చేశారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, సన్యాసికి రాజు మరణదండన విధించటం అక్రమం కాదా? రాజు అడిగిన ప్రశ్నలకు సన్యాసి సరి అయిన సమాధానం చెప్పక, తన ప్రాణాన్ని ఎందుకు పోగొట్టుకున్నాడు? తాను కూడా దొంగతనంలో భాగస్వామి అయినందు వల్లనా? లేక తనకు భాగం పంచిపెట్టిన అసలు దొంగను కాపాడటానికా? లేక తనకు చావు సమీపించిందని తెలిసా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది.'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రాజు దృక్పథానికీ, సన్యాసి దృక్పథానికీ ఎక్కడా పొంతనలేదు. మనుషులకు సహాయం చెయ్యటమే సన్యాసి తన ధర్మంగా పెట్టుకున్నాడు. మనుషులకు ఏర్పడే సమస్యలు ధర్మసమ్మత మైనవో, అధర్మమైనవో సన్యాసి విచారించలేదు. ఆయన డబ్బు పేదలకూ, బిచ్చగాళ్ళకూ పంచటంలో కూడా అదే వైఖరి కనిపిస్తుంది. ఆయన దొంగతనం అన్నదాన్నే గుర్తించడు. అందుచేత దొంగను రాజుకు పట్టియ్యటం అనే సమస్యలేదు. ఏ కోరికలూ లేని సన్యాసి చావంటే భయపడక పోవటం వింతకాదు. రాజుగారి దృష్టిలో దొంగతనం ఒక నేరం అయితే, రాజధనాన్ని బిచ్చగాళ్ళకు పంచటం మరింత ఘోరమైన రాజకీయనేరం. అందుచేత రాజు సన్యాసికి మరణదండన విధించటంలో ఆయన తొందరపాటు ఏమీలేదు.'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# స్వప్న వృత్తాంతం

ఒక రాజు మహా తిక్క మనిషి. ఆయన తరచుగా ఎవరినో ఒకరిని ఏదో ఒక అసాధ్యమైనది అడిగి, వారు దాన్ని సాధించలేకపోతే కారాగృహంలో పెట్టిస్తూ ఉండేవాడు.

ఒకసారి రాణిగారి పుట్టిన రోజు దగ్గిరలో ఉన్నదనగా, రాజు ఒక స్వర్ణకారుణ్ణి పిలిపించి, "నాకు కలలో నెమలికన్ను లాంటి రత్నహారం కనిపించింది. అలాటి హారం పది రోజులలోగా చేసి పట్టుకురా," అన్నాడు.

స్వర్ణకారుడు అహోరాత్రాలు శ్రమపడి రంగురంగుల వజ్రాలతో అతి అందమైన హారం తయారు చేసి తెచ్చాడు. రాజు దాన్ని చూసి, "నేను కలలో చూసిన హారం ఇలా లేనేలేదు," అని స్వర్ణకారుణ్ణి కారాగృహానికి పంపేశాడు.

తరవాత స్వర్ణకారుడి కొడుకు పదమూడేళ్ళవాడు రాజును చూసి, తాను ఆ రత్నాల హారం చెయ్యగలనని హామీ ఇచ్చి, బంగారమూ, రత్నాలూ కొనటానికి సొమ్ము తీసుకుని, ఫలానా రోజుకు ఇస్తానని చెప్పి వెళ్ళాడు.

అయితే వాడు తాను పెట్టిన గడువునాడు రాక, మర్నాడు వచ్చి, "నాకు బహుమానం ఇప్పించండి," అని రాజును అడిగాడు.

"హారం ఎక్కడ?" అని రాజు అడిగాడు.

"నిన్న నాకు తమరు కలలో కనిపించి హారం పుచ్చుకుని, ఎంతగానో మెచ్చుకున్నారు కద!" అన్నాడు స్వర్ణకారుడి కొడుకు.

రాజు తన తప్పు తెలుసుకుని, స్వర్ణకారుణ్ణి చెరవిడిపించాడు. —ఆర్. జయలక్ష్మి





# వంటపుట్టి

ఒక ఊళ్లో రామేశం, జానకి అని అన్నా చెల్లెళ్ళు ఉండేవాళ్లు. వాళ్లకు చిన్నతనం లోనే తల్లి దండ్రులు పోయారు. అయినా రామేశం తన చెల్లెల్ని ఎంతో శ్రద్ధగా పెంచి, ఆమెకు పెళ్ళీడు రాగానే, దాపులనున్న గ్రామంలో మంచి సంబంధం చూసి ఘనంగా పెళ్ళి చేసి, ఆమెను అత్త వారింటికి పంపాడు.

జానకి భర్త గణపతికి కూడా తల్లి దండ్రులు లేరు. అతన్ని అందరూ బుద్ధి మంతుడని చెప్పుకునేవారు. అతనికి తల్లిదండ్రులు వదిలిపోయిన కొద్దో, గొప్పో ఆస్తి కూడా ఉన్నది.

జానకి మంచి పనిమంతురాలు. ఆమె మొగుడి ఇంటికి వస్తూనే నడుము బిగించి పనిలోకి జొరబడింది. గణపతి ఇల్లుదాటి ఎటూ పోక తన భార్య వెనకే తిరుగుతూ వంట గురించి, వార్పు గురించీ ఆమెను ప్రశ్నిస్తూ వచ్చాడు. అతనికి వంట బాగా చేయనవునట.

అతను వంట గురించి, వంటకాలను గురించీ విడవకుండా మాట్లాడు తుండటం చూసి జానకి ఆశ్చర్యపడింది. చిన్నతనంలోనే తల్లి, తండ్రీ పోయిన కారణంగా అతను వంట చేసుకు తినటం నేర్చుకుని, అందులో నైపుణ్యం సంపా దించాడు. అదీకాక అతను కాస్త భోజన ప్రియుడు కూడాను.

జానకి మొదటి పూట వండిన వంట గణపతికి నచ్చలేదు. అందుచేత ఆ రాత్రి గణపతి స్వయంగా వంటకు ఉపక్ర మించాడు. క్షణంలో అతను అద్భుతంగా వంట చెయ్యటం చూసి జానకి ఆశ్చర్య పోయింది.

అటు తరవాత గణపతి జానకిని వంట ఇంట్లోకి రానియ్యక, పూట పూటా తానే

గవ్వల నిర్మలాదేవి



రుచులు రుచులుగా వంట చేస్తూ రాసాగాడు.

"జానకి అదృష్టవంతురాలు, చక్కగా వండిపెట్టే మొగుడు దొరికాడు," అని అమ్మలక్కలు జానకిని చూసి ఈర్ష్య పడేవాళ్ళు. జానకి ఇదిచూసి మొదట కాస్త గర్వపడినా, తన మొగుడు బొత్తిగా వంటపుట్టిగా ఉండటం ఆమెకు చిరాకు కలిగించసాగింది. రోజులు గడిచిన కొద్దీ ఇది ఆమెకు తీరని అవమానం కూడా అయింది. మొగుడి ధోరణి ఎలా మార్చాలో, అందుకు ఏమిచెయ్యటం బావుంటుందో ఎంత ఆలోచించినా ఆమెకు అంతుచిక్కలేదు.

ఒకరోజు రామేశం జానకిని చూసి పోవటానికి వచ్చి, త్వరలో తానూ, మరి పదిమంది మిత్రులూ తీర్థయాత్రలకు పోతున్నట్టు చెప్పాడు. అతను విచారించగా గణపతి వంట పనిలో ఉన్నట్టు తెలిసింది. వంటింట్లో గణపతి బొబ్బట్లు వత్తు తుండటం చూసి రామేశానికి నవ్వు ఆగలేదు.

గణపతి రామేశాన్నిచూసి, "రా బావా! సమయానికి వచ్చావు! నేను వండే నేతి బొబ్బట్లు ఎలా ఉన్నాయో రుచిచూసి చెప్పాలి," అన్నాడు.

ఆ మాట వినేసరికి జానకికి తల తీసేసినట్టయింది.

రామేశం ఉన్న రెండు పూటలూ గణపతే వంట చేశాడు. వంట అయితే చాలా బాగున్నది గాని, గణపతి పద్ధతి రామేశానికి నచ్చలేదు. గణపతి ఇంట్లో లేని సమయం చూసి జానకి తన అన్నకు విషయమంతా చెప్పి, గణపతి బుద్ధి మారే మార్గం చూడమని ప్రాధేయ పడింది.

ఆలోచించిన మీదట రామేశానికి ఒక మార్గం తట్టింది. గణపతి ఇంటికి రాగానే అతను గణపతికి తమ తీర్థ యాత్రలను గురించి చెప్పి, "నువు కూడా మా వెంటరాకూడదూ? ఖర్చు

సంగతి నేను చూసుకుంటాను. ఆ నాలుగు రోజులూ జానకి మా ఇంట్లో ఉంటుంది," అన్నాడు.

గణపతికి ఈ ప్రయాణం అంత ఇష్టంలేదు. రామేశం మరీ బలవంతం చేసిన మీదట, తన ఖర్చు తానే భరించు కునే షరతు మీద అతను వాళ్ళ వెంట తీర్థయాత్రలకు బయలు దేరటానికి ఒప్పు కున్నాడు.

ముగ్గురూ కలిసి రామేశం ఊరు వెళ్ళారు.

రామేశం తన మిత్రులతో తమ వెంట గణపతి కూడా వస్తున్న సంగతి చెప్పి, "మన కార్యక్రమం కొద్దిగా మారింది. మనం మజిలీ చేసిన చోటనల్లా పూట కూళ్ళు తిననవసరం లేదు. సంబారాలు వెంట తీసుకుపోతే మన వంట మనమే చేసుకు తింటాం," అన్నాడు.

"అలా అయితే మరీ మంచిది. ఖర్చు కలిసివచ్చి, మంచి భోజనం కూడా అమరుతుంది. కాని అసలు సమస్య, మనలో వంట చేసేదెవరు?" అని మిత్రులు రామేశాన్ని అడిగారు.

"మా బావమరిది గణపతిది నలభీమ పాకం!" అన్నాడు రామేశం.

అనుకున్న రోజుకు అందరూ తీర్థ యాత్రలకు బయలుదేరారు. వాళ్లు చేరిన మొదటి పుణ్యక్షేత్రంలో ధర్మసత్రంలో దిగి, అందరూ స్నానాలు చేశారు. సత్రపు యజమాని వాళ్ళకు పాత్ర సామగ్రి



ఇచ్చాడు. కొందరు వెళ్ళి కూరలూ, వంటచెరుకూ పట్టుకొచ్చి గణపతికి అందించారు. గణపతి వంట పనిలోకి దిగగానే అందరూ వింతలూ, గుళ్ళూ, గోపురాలూ చూడటానికి బయలుదేరి వెళ్ళిపోయారు.

గణపతి వంట ముగించేసరికి వాళ్ళు చూడదగినవన్నీ చూసి తిరిగి వచ్చేసి, గణపతి వంటను మెచ్చుకుంటూ భోజనాలు చేసి, రెండు పూటల కని చేసిన వంట ఆ పూటే స్వాహా చేసేశారు. కొంత విశ్రాంతి తీసుకుని మిగిలిన వాళ్ళు బయలుదేరే సమయానికి గణపతి మళ్ళీ రాత్రి భోజనాలకుగాను, వంటకు ఉపక్రమించవలసి వచ్చింది.

మిగిలిన మజిలీలలోనూ ఇంచుమించు ఇలాగే జరిగింది. అందరూ బయటికి వెళ్ళి అన్నీ చూసేవారు; గణపతికి కాలమంతా వంటతో సరిపోయేది. తాను ఎక్కడికీ వెళ్ళలేకపోయినందుకూ, ఏమీ చూడలేకపోయినందుకూ గణపతికి తన మీద తనకే అసహ్యం పుట్టింది. తన వంట బాగున్నదని మిగిలినవాళ్ళు మెచ్చుకోవటం రానురాను అతనికి కారం రాచినట్టు అయింది. అతని డబ్బు దండగ అయిపోగా, తీర్థయాత్రలలో అతనికి దక్కింది వెట్టిచాకిరీ మాత్రమే. పది మందికి రెండుపూటలూ వంట చెయ్యటమంటే మాటలా!

తీర్థయాత్రలు ముగిసినాక గణపతి, జానకీ తమ ఇంటికి తిరిగి వచ్చారు. కాని గణపతి పూర్వంలాగా వంటగదిలో దూరక, చావడిలో కూర్చుని, తనని చూసిపోవటానికి వచ్చినవాళ్ళు తీర్థయాత్రల విశేషాలు అడుగుతుంటే తాను విన్నవీ, లేనివీ కలిపి చెప్పేశాడు.

అది మొదలు గణపతి వంటఇంటికెసి రాలేదు. అతనిలో వచ్చిన మార్పు చూసి జానకి సంతోషించింది. చిత్రమేమిటంటే, జానకి వండిపెట్టితే తినేటప్పుడు ఆమె వంటకు వంకలు పెట్టటం కూడా మానేశాడు గణపతి!



# చెప్పుల దొంగ

కన్నప్పా, పొన్నప్పా ఇరుగు పొరుగు వాళ్ళు. కన్నప్ప కాస్త కలిగినవాడు. పొన్నప్ప కొంచెం బీదవాడు. అయితే అతను కష్టపడి పనిచేస్తూ, డబ్బు పొదుపు చేస్తూ కొంచెం మంచి స్థితికి రాసాగాడు. త్వరలోనే అతను తనతో సమానం అవుతాడని కన్నప్పకు ఈర్ష్యపుట్టింది.

ఒకసారి కన్నప్ప కొత్త చెప్పులు కొన్నాడు. తాను కూడా చెప్పులు కొనుక్కోవాలని ఉన్నదని పొన్నప్ప అతనితో అన్నాడు. "చెప్పులు అలవాటు చేసుకోకు. తరవాత అవి లేకుండా నడవలేవు. డబ్బు దండగ అవుతూ పోతుంది," అన్నాడు కన్నప్ప.

కాని పొన్నప్ప ఒక నెల గడిచాక చెప్పులు కొననే కొన్నాడు. ఒకరోజు అతను కొత్త చెప్పులు వేసుకుని దేవాలయానికి పోయి, చెప్పులు ఒకచోట వదిలి, ప్రదక్షిణలుచేసి వచ్చాడు. చెప్పులు లేవు, కాని కన్నప్ప కనిపించాడు. మర్రిచెట్టు కింద జడలస్వామిని ప్రశ్న అడగమని ఎవరో పొన్నప్పకు సలహా ఇచ్చారు.

తరవాత కన్నప్ప పొన్నప్పను చూసి, "జడలస్వామిని అడిగావా? ఆయన చెప్పుల మాట ఏమన్నాడు?" అని అడిగాడు.

"చెప్పులు పోవటం మంచిదే అయిందిట. నా దరిద్రం అవి దొంగిలించిన వాడికి పట్టుకున్నదిట. ఒక సంవత్సరంలో వాడు బికారి అయిపోతాడట. పోతే పోయాయి వెధవ చెప్పులు," అన్నాడు పొన్నప్ప.

మర్నాడు దేవాలయానికి పొన్నప్ప వెళ్ళేసరికి అతని కొత్త చెప్పులు అక్కడ పెట్టి ఉన్నాయి. తరవాత మాటల సందర్భంలో పొన్నప్ప కన్నప్పతో, "నేను జడలస్వామి దగ్గిరికి పోనే లేదు," అన్నాడు.

—అజీజా షెరీఫ్





# రాజుగారి ప్రాపకం

అవంతి దేశాన్ని ఏలే భాస్కరసేనుడు సమర్థుడైన పరిపాలకుడుగా పేరు తెచ్చుకున్నాడు. అందుకు చాలావరకు కారణం సుమాన్యుడు అనే రాజుగారి సలహాదారుడు. అతను రాజోద్యోగులకు సంబంధించిన వ్యవహారాలన్నీ చూసేవాడు. ఏయే శాఖలకు ఎందరెందరు ఉద్యోగులు అవసరమో, ఎవరెవరి పదవులు పెంచవచ్చునో, ఎవరి జీతాలు ఎంత ఉండాలో రాజుకు చెప్పటం సుమాన్యుడి పని.

ఎంతో కీలకమైన బాధ్యత నిర్వహిస్తున్నప్పటికీ, సుమాన్యుణ్ణి గురించి చాలా మందికి తెలీదు. అతని బాధ్యతలు అందరికి తెలిసిపోతే కొందరు ఉద్యోగులు అతన్ని ఆశ్రయించి లాభం పొంద యత్నించే అవకాశం ఏర్పడుతుందని భాస్కరసేనుడు అతని ఉద్యోగాన్ని రహస్యంగా ఉంచాడు.

సుమాన్యుడు ఫలానా ఉద్యోగం చేస్తున్నాడని అతని భార్య లక్ష్మికి తెలీదు. కాని అతను చేసే ఉద్యోగం చాలా ముఖ్యమైనదని ఆమెకు తెలుసును. ఎంతకాలం గడిచినా తన భర్త సంపాదన పెరగకపోవటం ఆమెకు చాలా బాధగా ఉండేది. ఆ విషయం ఆమె హెచ్చరించినప్పుడల్లా సుమాన్యుడు, "మన సంపాదన మనకు చాలనప్పుడు కదా—" అని ఆమె మాట తోసిపారేసేవాడు.

ఆఖరుకు లక్ష్మి తన భర్తతో గట్టిగానే తగవులాడింది: "మీ కన్న వెనక వచ్చిన వాళ్ళూ, మీ కంటె చిన్న పనులు చేస్తున్న వాళ్ళూ అప్పుడే మేడలు కట్టేస్తున్నారు. మనం మాత్రం చేతకానివాళ్ళలా సొంత ఇల్లు కట్టుకోలేకుండా ఉన్నాం."

ఇలా అని లక్ష్మి కొందరి పేర్లు కూడా చెప్పింది.

"అయితే ఇంత స్వల్ప కాలంలో వాళ్ళకు అంత డబ్బు ఎలాగొచ్చిందంటావు?" అని సుమాన్యుడు అడిగాడు.

"రాజుగారి ప్రాపకం వల్ల. ఈ రోజుల్లో ముక్కుకు సూటిగా, మన పనులు మనం చేసుకుంటూ పోతే లాభంలేదు. తరచు రాజదర్శనం చేసుకుంటూండాలి, ఆయనను పొగడుతూండాలి, తృణమో, పణమో అర్పించుకుంటూండాలి! కుచేలుడు కూడా కృష్ణుడికి అటుకులు ఇస్తేనే కృష్ణుడు అతడికి అష్ట ఐశ్వర్యాలూ ఇచ్చాడు," అన్నది లక్ష్మి.



భార్య మాటలు సుమాన్యుడి మీద బాగా పని చేశాయి. అదిమొదలు అతను రాజదర్శనం చేసుకునే వారిని శ్రద్ధగా గమనించ సాగాడు. నాలుగు మెచ్చుకోలు కబుర్లు చెప్పి, ఏ చిన్న వస్తువు అయినా కానుక ఇచ్చుకున్న వారికి రాజసన్మానం లభిస్తున్నది. తాను సంవత్సరం కష్టపడి సంపాదించే డబ్బు వీళ్ళు క్షణాల మీద సంపాదిస్తున్నారు!

ఈ సత్యం గ్రహించినాక సుమాన్యుడి మనసు మారింది. అతను నెమ్మదిగా తన పద్ధతులను మార్చుకో సాగాడు. పని కల్పించుకుని, ఒకటికి రెండుసార్లు రాజును చూడబోవటమూ, మాటలతో ఆయనను సంతోష పెట్టటానికి ప్రయత్నించటమూ, చిన్న కానుకలు సమర్పించుకోవటమూ ప్రారంభించాడు అతను.

ఇలా కొన్ని రోజులు జరిగిన మీదట భాస్కరసేన మహారాజు తన ప్రధాన మంత్రితో, "సుమాన్యుడి స్థానంలో మరొక వ్యక్తిని నియమించటం అవసర మనిపిస్తున్నది. సుమాన్యుడికి మరో ఉద్యోగం చూతాం. మీ ఉద్దేశమేమిటి?" అన్నాడు.

"సుమాన్యుడి లాటి సమర్థుడు అతను చేసేపనికి దొరకడం కష్టమనుకుంటాను," అన్నాడు ప్రధానమంత్రి.

"అతనిలో పూర్వం ఉండిన సామర్థ్యం ఇప్పుడు లేదని నాకు అనుమానం కలిగింది," అన్నాడు రాజు.

"ఎందువల్ల?" అని ప్రధానమంత్రి అడిగాడు.

"ఒకప్పుడు అతను తన పనులన్నీ తానే చూసుకుని, తాను చేసిన నిర్ణయాన్ని నాకు తెలపడానికి మాత్రమే వచ్చేవాడు. ఇప్పుడు అతను నిర్ణయం నాకే వదిలేస్తున్నాడు. వెనకటిలా కాకుండా ఇప్పుడు అతను నన్ను తరచువచ్చి చూస్తున్నాడు. అంటే తీరుబడి ఎక్కువ అయిందన్న మాట! చిన్న చిన్న కానుక లిచ్చి నన్ను సంతోష పెట్ట యత్నిస్తున్నాడు. ఇదివరకు నన్ను తన పనితో సంతోష పెట్టినవాడు కానుకలతో సంతోష పెడుతున్నాడంటే, పనిలో అతని నేర్పు తగ్గిందనే కదా?" అన్నాడు రాజు.

ప్రధానమంత్రి ఒక్కక్షణం ఆలోచించి, "ఒక్కసారి నన్ను అతనితో మాట్లాడి చూడనియ్యండి." అన్నాడు.

రాజు సరే నన్నాడు.

ప్రధానమంత్రి సుమాన్యుణ్ణి కలుసుకుని, "సమర్థుడైన ఉద్యోగి తన బాధ్యతలను సక్రమంగా నిర్వర్తిస్తాడు. అసమర్థుడైన ఉద్యోగి రాజుగారి ప్రాపకంతో పైకి రావాలనుకుంటాడు. ఇటీవల నీ ప్రవర్తన చూసి రాజుగారికి నీ పైన నమ్మకం పోయింది. నీ ఉద్యోగం ఊడే పరిస్థితి వచ్చింది," అన్నాడు.

సుమాన్యుడు తన బాధ ప్రధానమంత్రికి చెప్పుకున్నాడు. అంతా విని ప్రధానమంత్రి రాజుకు చెప్పాడు.

భాస్కరసేనుడికి తన పొరపాటు అర్థమయింది. సుమాన్యుడి వంటి దక్షత గలవాడు తప్పుదారి పట్టితే తాను తెలుసుకోగలిగాడు, కాని అదే పద్ధతి అవలంబించిన అసమర్థులను ఆయన కనిపెట్టలేకపోయాడు. ఆయన సుమాన్యుడికి చక్కని భవంతిని కట్టించి ఇచ్చి, తనను పొగడవచ్చేవారినీ, తనకు కానుకలిచ్చేవారినీ విమర్శనా దృష్టితో చూడడం నేర్చుకున్నాడు. క్రమంగా దేశంలో అసమర్థులకు రాజుగారి ప్రాపకం తగ్గిపోయింది.



# 174. క్షమాదేవి

చైనాలోని, ఏన్ చౌ పట్టణ సమీపాన గల టపోట్సిదేవాలయంలోని, 'క్వాన్‌ఇన్' అనే క్షమాదేవి విగ్రహం యిది. ఈ విగ్రహాన్ని నిటారుగా వున్న ఎర్రరాతి కొండలో చెక్కి, బంగారు పూతతో, వివిధ వర్ణాలతో తీర్చి దిద్దారు. ఎడమ పక్కన 65 అడుగుల ఎత్తుగల బుద్ధవిగ్రహం వున్నది. ఆ విగ్రహం చేతివేళ్ళూ, గోళ్ళూ బొమ్మలో చూడవచ్చును.





# అమ్మాయి పెళ్ళి

మంగయ్యా, మంగమ్మా అనే దంపతులకు పెళ్ళీడు వచ్చిన కూతురు ఉన్నది. మంగమ్మ బుద్ధి మంచిది కాదు. మంగయ్య స్వతహాగా సాధువేగాని, పెళ్ళాం నోటికి దడిసి, ఆమె ఆడించినట్టు ఆడేవాడు. పిల్ల పెళ్ళికి డబ్బు కూడబెట్టమని మంగమ్మ తన భర్తను ఏనాటి నుంచో పోరుతున్నది. కాని ఆ ఒక్క పనీ మంగయ్యకు సాధ్యం కాలేదు.

ఒకనాడు వాళ్ళ అమ్మాయి, తన స్నేహితురాలి పెళ్ళికని, మరో ఊరు వెళ్ళింది. ఆ రోజు మధ్యాన్నం మంగమ్మ తన మొగుడితో, "ఎలాగయినా మరో మాసంలోగా అమ్మాయి పెళ్ళి చేసితీరాలి. దాని తోటి వాళ్ళందరి పెళ్ళిళ్ళూ అయిపోతున్నాయి. నీకేమో చీమకుట్టినట్టయినా లేదు. అన్నింటికీ నేనే ఎలా చచ్చేది?" అంటూ సాధింపుకు దిగింది.

"నేను మాత్రం ఏం చేసేది? నా సంపాదన ముప్పూటలా తిండికే సరిపోతూండె! పోని నీకు మీ వాళ్ళు పెట్టిన నగలున్నాయి కదా! వాటిని అమ్మేసి అమ్మాయి పెళ్ళి జరిపించేదాం. ముసలి ముండవు. నీకింకా సింగారాలేమిటి?" అన్నాడు మంగయ్య.

ఈ మాటకు మంగమ్మ మూతి ముడుచుకున్నది. ఆమెకు అంతులేని నగలపిచ్చి.

ఆమె ఒక్క క్షణం ఆలోచించి, "ఒక పని చేద్దాం. పొరుగింటి కామాక్షమ్మ ఒంటి మీద మన పిల్ల పెళ్ళికి సరిపోగల నగలున్నాయి. అవి ఎలాగయినా కాజేద్దాం. కామాక్షమ్మను బుట్టలో వెయ్యటం కష్టం ఏమీ కాదు." అన్నది.

అందుకు మంగమ్మ వేసిన పథకం ఏమిటంటే: ఆ రాత్రి మంగయ్య తమ పెరట్లో ఉన్న పశువుల కొట్టంలో

ఎం. కామేశ్వరరావు

దాక్కుంటాడు. మంగయ్య ఊరికి వెళ్ళాడని చెప్పి, మంగమ్మ కామాక్షమ్మను తోడు తెచ్చుకుంటుంది. ఒకరాత్రి వేళ మంగయ్య, ఒంటినిండా గొంగళి కప్పుకుని, కత్తితో బెదిరించి ఆడవాళ్ళ ఇద్దరి నగలూ దోచుకు పోతాడు. ఆ తరవాత పిల్ల పెళ్ళి నిర్విఘ్నంగా జరిగిపోతుంది.

మంగయ్యకు ఇదంతా చాలా అక్రమంగా తోచింది. కాని పెళ్ళాన్ని కాదనలేక సరే నన్నాడు.

ఆ సాయంత్రం మంగమ్మ కామాక్షమ్మ ఇంటికి వెళ్ళి, ''ఇంటాయన ఊరికి వెళ్ళాడు. అమ్మాయి స్నేహితురాలి పెళ్ళికి వెళ్ళింది గదా. బిక్కు బిక్కుమంటూ ఒక్కతెనూ కూర్చోలేను. కామాక్షమ్మా! కాస్త ఈ రాత్రి వచ్చి నాకు తోడుగా ఉందూ!'' అన్నది.

''అలాగేలే, మంగమ్మా! దాని కేం భాగ్యం? రాత్రికి తప్పక వస్తాను.'' అన్నది కామాక్షమ్మ.

మంగమ్మ తన ఇంటికి తిరిగి వచ్చి, చీకటి పడగానే భర్తకు భోజనం పెట్టి, పశువుల కొట్టంలోకి పంపేసింది. తరవాత ఆమె అతనికి కాపుకుర్రవాడి గొంగళి చూపించి, ''ఇది ఒళ్ళంతా కప్పుకో. కత్తి చూపించినప్పుడు కఠినంగా మాట్లాడు. ఇద్దరి నగలూ ఒలుచుకు పోవటం మరవకు. గొంతు మార్చు.'' అని మళ్ళీ మళ్ళీ హెచ్చరించింది.



చీకటి పడ్డాక కామాక్షమ్మ వచ్చింది. కామాక్షమ్మ తన నగలు తీసివేసి వస్తుందేమోనని మంగమ్మ భయపడింది గాని, అలా జరగలేదు. కామాక్షమ్మ నగలన్నీ ఒంటిమీదే ఉన్నాయి.

ఆడవాళ్ళిద్దరూ కాస్సేపు పిచ్చాపాటి మాట్లాడుకున్నాక, మంగమ్మ ఎదురు చూస్తున్నట్టుగా, నిండా గొంగళి కప్పుకుని భయంకరంగా అరుస్తూ, కత్తి చేతపట్టుకుని ఒక ఆకారం రానేవచ్చింది.

మంగమ్మ కెవ్వుమని, "బాబోయ్, దొంగాడు! మన నగలు కాజెయ్యాడు గదా?" అంటూ భయం నటించింది. అంతటితో ఆగక ఆమె తన నగలన్నీ తీసి ఇస్తూ, "కామాక్షమ్మా, బతికుంటే బలుసాకు తినవచ్చు. నీ నగలు కూడా తీసి ఇచ్చెయ్యి." అని కామాక్షమ్మతో అన్నది.

ఇద్దరూ తమ నగలు తీసి ముసుగు మనిషికి ఇచ్చేశారు. ఆ మనిషి పెరట్లోకి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి ఆడవాళ్ళు మరి నిద్రపోలేదు; ఒకరినొకరు ఓదార్చుకుంటూ కూర్చున్నారు. వెలుగు రాగానే, ఈ విషయం నలుగురికీ చెబుతానని కామాక్షమ్మ వెళ్ళిపోయింది.

మంగమ్మ చప్పున పెరట్లోకి వచ్చి, పాకలో భర్తను తట్టి లేపింది. మంగయ్య కళ్ళు నులుముకుంటూ లేచి, "అప్పుడే కామాక్షమ్మ వచ్చిందా?" అన్నాడు పెద్దగా ఆవలిస్తూ.

మంగమ్మ నిర్ఘాంతపోయి, "అదేమిటి? రాత్రి మా యిద్దరి నగలూ పట్టుకుపోయింది నువు కాదూ?" అని అనుమానంగా అడిగింది.

రాత్రి జరిగినదేదీ తన భర్తకు తెలియదని రూఢికాగానే ఆమె ఘొల్లుమన్నది.

ఒక మాసం గడిచాక, తమ లాగే డబ్బుకు ఇబ్బందిపడే కామాక్షమ్మ తమ కూతురి పెళ్ళి ఘనంగా చేసింది. తనకు తట్టిన ఆలోచనే కామాక్షమ్మకూ తట్టిందని అప్పటికైనా మంగమ్మ గ్రహించలేదు.



# ఎన్నిక

సేనాధిపతి పదవి ఖాళీ అయింది. దాని కోసం, రాణా, రంజిత్, కిశోర్ అనే వాళ్ళు ఎదురు చూస్తున్నారు. కాని మంత్రి ఒక యుక్తి ఆలోచించి, రాజుగారి చేత ఆస్థానవిదూషకుణ్ణి ఆ పదవికి వేయించాడు.

కత్తి పట్టలేని వాడి కింద పని చెయ్యటమంటే బాధవేసి, రాణా విదూషకుణ్ణి చంపే ప్రయత్నంలో దొరికిపోయాడు. రాజు మారువేషంలో వెళ్ళి రంజిత్‌ను కదిలించాడు.

"నా లాటి మహావీరుణ్ణి కాదని, రాజుగారు కళ్ళుమూసుకుని సేనాధిపతి పదవికి విదూషకుణ్ణి నియమించాడు. రేపు యుద్ధం వస్తే విదూషకుడి వల్ల గర్వభంగం తప్పదు. నేను ఏ రకంగానూ సాయం చెయ్యను," అన్నాడు రంజిత్.

తరవాత రాజు మారువేషంలో కిశోర్‌ను కదిలించి చూచాడు.

"మహారాజు అనాలోచితంగా ఏ పని చెయ్యరు. విదూషకుడి వల్ల ఏదో ఉపయోగం ఉండే ఉంటుంది," అన్నాడు కిశోర్.

సేనాధిపతి పదవి కిశోర్‌కు దక్కింది.

—చెల్లూరి సీతారాజేశ్వరరావు





# సీతాపురరాజు

సీతాపురరాజు తపనకుమారుడు బహు సమర్థుడైన పాలకుడు. అతని ఏలుబడిలో ప్రజలు ఎంతో సుఖపడ్డారు. సుఖం లేని వాడు రాజే. ఎందుకంటే అతనికి అనుసుయాదేవితో వివాహం జరిగి అయిదేళ్ళు దాటినా వారికి సంతానం కలగలేదు. తపనకుమారుడు చేసిన పూజలూ, వ్రతాలూ ఎందుకూ పనికి రాకుండా పోయాయి. వైద్య సహాయంలో కూడా ఎలాటి లోటూ లేదు.

"పిల్లలు కలగకపోవటానికి అనుసుయాలోనే ఏదో లోపం ఉండి ఉండాలి," అనుకుని తపనకుమారుడు ఆమె పట్ల నిరాదరణగా ప్రవర్తించటం ప్రారంభించి, ఆమెతో మాట్లాడటం కూడా మానేశాడు.

వృద్ధ ఖజానామంత్రి చారుదత్తుడు మహాకుటిలుడూ, తెలివిగలవాడూనూ. ఆయనకు అందచందాలు గల కూతురు వున్నది. ఆమెను రాజుకు పెళ్ళిచేసి, ఆస్థానంలో రాజుగారి మామగారుగా తన హోదా పెంచుకోవాలన్న ఉద్దేశంతో చారుదత్తుడు, అనుసుయా పట్ల రాజుకు గలద్వేషాన్ని రెచ్చగొట్టి, రాజును ఆకర్షించటానికి తన కుమార్తెకు రాజును కలుసుకునే సన్నివేశాలు సృష్టించాడు. తపనకుమారుణ్ణి చారుదత్తుడి కుమార్తె చంద్రిక ఆకర్షించసాగింది.

ఈసంగతి పొడగట్టగానే చారుదత్తుడు, "మహారాజా, నా కుమార్తెను మీ దాసిగా స్వీకరించ కూడదా? అనుసుయాదేవి అయిదేళ్ళుగా చెయ్యలేని పని, ఈమె ద్వారా జరిగి, మీకు సంతానప్రాప్తి కలగవచ్చు. చంద్రిక అందగత్తె: యౌవనవతి. ఆమె మీ జీవితానికి మంచి వెలుగూ, ఆనందమూ ఇయ్యవచ్చు." అన్నాడు.

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

దానికి రాజు, ''ఇది సూటిగా నేను నిర్ణయించే విషయం కాదు. ఇతర మంత్రులతో సంప్రతించాలి. కొంత వ్యవధి ఇయ్యండి,'' అన్నాడు.

''దాని కేం? అలాగే కానియ్యండి. కాని నేను చెప్పిన విషయం మనసులో ఉంచండి. మీ మనశ్శాంతికి ఇదే మార్గం కావచ్చు.'' అన్నాడు చారుదత్తుడు.

కొద్ది రోజుల అనంతరం తపనకుమారుడు తన ప్రధానమంత్రి ధీమాన్‌ను పిలిచి, ''నేను మరొక వివాహం చేసుకోవటం గురించి మీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు.

అకస్మికంగా రాజుకు రెండో పెళ్ళి ఆలోచన ఎలా కలిగిందని మంత్రి అడిగితే, రాజు చారుదత్తుడన్న మాట చెప్పి, ''నేనింకా ఏ నిర్ణయమూ చెయ్యలేదు. మంచి చెడ్డలు ఆలోచించాలి గద. ఏ నిర్ణయం చేసినా మీకు తెలియకుండా చెయ్యను,'' అన్నాడు.

''అలా అయితే, నా అభిప్రాయం చెప్పటానికి కొంచెం వ్యవధి ఇయ్యండి. ఆ తరవాత మీరు ఎలా నిర్ణయించినా సరే." అన్నాడు మహామంత్రి.

''మీ అభిప్రాయం ఏమిటో సాధ్యమైనంత త్వరలో చెప్పితే సంతోషిస్తాను,'' అన్నాడు రాజు.




తపనకుమారుడికి బేలునగరు రాజకుమార్తె అనుసుయాను కుదిర్చినవాడు మహామంత్రే. ఆమెను ఆయన తన కూతురులాగా చూసేవాడు. ఆమె సంతానవతి కాకపోవటం ఆయనకు కూడా తీరని విచారంగానే ఉండేది. అందుచేత ఇప్పుడు తపనకుమారుడి ఉద్దేశం వినగానే ఆయనకు నెత్తి మీద పిడుగు పడ్డట్టయింది.

ఆయన అనుసుయాను చూడబోయాడు. ఆయన చెప్పిన కబురు వింటూనే ఆమె హతాశురాలై, ఏడుస్తూ, ''నన్ను రక్షించండి. నాకు పిల్లలు లేని కారణంగా ఆయన మరొక పెళ్ళి చేసుకుంటే నేను జీవించను, నేనింకా చిన్న



వాన్నే. నాకు పిల్లలు ఎందుకు కలగరాదు. నిన్న శివరాత్రి పగలూ, రాత్రీ ఉపవాసం ఉండి, తెల్లవారు ఝామున చిన్ననిద్ర పోయాను. అప్పుడు కలలో శివుడు కనిపించి, నా చేతిలో ఉన్న పండు తింటే నాకు మంచికొడుకు పుడతాడని చెప్పాడు. లేచి చూస్తే నిజంగానే నా కుడి చేతిలో పండు ఉన్నది. ఇదే ఆ పండు! చూడండి.'' అని ఒక చిన్న పండును మహామంత్రికి చూపింది.

అది చూసి మహామంత్రి, ''తల్లీ, నిన్ను ఈశ్వరుడైతే అనుగ్రహించాడుగాని నీ వర్త ఇదంతా నాటకమని కొట్టిపారెయ్యవచ్చు. ఈ రెండో పెళ్ళి ఆలోచనను శాశ్వతంగా తొలగించటానికి ఇంకేదైనా మార్గం చూడాలి. నాకు మీ తండ్రి ఆస్థాన ఐంద్రజాలికుడు మాయాధరుడి సహాయం కావాలి. నీ టపా పావురాన్ని ఇచ్చావంటే అతనికి కబురు చేసి, ఈ రాత్రికే సమాధానం తెప్పించవచ్చు. సమాధానం రాగానే దాన్ని నాకు పంపు,'' అన్నాడు.

అనసూయాదేవి ఆయనకు తన పావురాన్ని ఇచ్చింది. ధీమాన్ దాన్ని తన ఉత్తరీయం చాటున దాచి తీసుకుపోయాడు.

మర్నాడు ఉదయం ధీమాన్ రాజును కలుసుకుని, కాళీమాతకు ప్రత్యేకమైన పూజ ఏర్పాటు చేస్తున్నట్టు చెప్పాడు.

''నిన్న రాత్రి నాకు కలలో మహాకాళి కనిపించి, ఒక రోజల్లా ఉపవాసం ఉండమని, తమ పేర తనకు ప్రత్యేకంగా పూజ జరిపించమనీ, మీరు రాణీగారిని దూరం చెయ్యటం తనకు అసంతృప్తి కలిగించిందనీ, మీ ఇద్దరి శరీరాలూ, ఆత్మలూ ఒకటేననీ చెప్పింది,'' అన్నాడు మహామంత్రి.

తపనకు మారుడు వెటకారంగా నవ్వి, ''మహామంత్రి, మీ కట్టుకథలు ఇంకా చెప్పండి! అనసూయా మీద మీకు గల వాత్సల్యం నే నెరుగుదును. ఎలాగైనా

నా బుద్ధి ఆమె కేసి మళ్ళించాలని చూస్తున్నారు. కాని అది సాధ్యంకాదు. నాకు కావలసినది సంతానం,'' అన్నాడు.

''నా మాటలు నమ్మకపోతే పోనియ్యండి. ఈ పూజకు మాత్రం అనుమతించండి,'' అన్నాడు ధీమాన్.

''పూజ చేయించకుండా ఎవరు మిమ్మల్ని అడ్డుతారు? నేను కూడా వస్తాను,'' అన్నాడు రాజు.

మహామంత్రి ధీమాన్ శ్రద్ధా భక్తులతో మహాకాళి పూజచేసేటప్పుడు రాజూ, రాణీ మహాకాళివిగ్రహం ముందు కూర్చున్నారు. పూజ అయిపోతూనే ధీమాన్ పూనకం వచ్చినట్టు పడిపోయి, పొర్లుతూ, ''మాతా! మాతా!'' అని వెర్రి కేకలు పెట్టాడు. తరవాత ఆయన లేచి నిలబడి, ''మళ్ళీ చెబుతున్నాను. తపనకుమారుడి జీవితంలోనూ, ఆత్మలోనూ అనుసుయా భాగస్వామిని. ఆమె తపనకుమారుడి జీవితం నుంచి విడిపోవటానికి వీలులేదు,'' అన్నాడు గంభీరస్వరంతో.

తపనకుమారుడి ముఖంలో చిదర భావం కనిపించింది. ''ఇంక నేను పోతాను, మహామంత్రీ. మీరు మళ్ళీ అదేధోరణిలో పడ్డారు. ఈ అర్థంలేని మాటలు వినటానికి నాకు ఓపికలేదు,'' అన్నాడతను.



''ఆగు! కదలకు!'' అని మహామంత్రి గర్జించి. ''నేను మహాకాళిని! ధీమాన్ ద్వారా మాట్లాడుతున్నాను. నీకు రుజువుకావాలా?'' అని అడిగాడు.

తపనకుమారుడు చప్పున కూలబడిపోయాడు. ధీమాన్ నిలబడి, మహాకాళి పాదాల దగ్గిర ఉన్న సిందూరం ముద్ద కొంచెం తీసి, ఒక పువ్వుకాడ కూడా తీసుకుని ముందుకు వచ్చి, ''మహారాజా, మీ ఎడమచెయ్యి ఒకసారి తెరవండి. మహారాణీ, మీరు కూడా ఎడమచెయ్యి తెరుస్తారా?'' అన్నాడు.

''మహారాజా, మీరు దేన్ని నమ్మరు గదా. మీ చేతినీ, మహారాణి చేతినీ బాగా

పరిశీలించండి. తరవాత మోసం జరిగింది అనగలరు.'' అన్నాడు మహామంత్రి.

రాజు తన అరచేతిని, రాణీ అరచేతిని జాగ్రత్తగా పరిశీలించాడు.

ధీమాన్ సిందూరం ముద్దనుంచి పువ్వు తొడిమతో కొంత సిందూరం తీసి, మహారాణి చేతిలోని అదృష్టరేఖకు ఏటవాలుగా సన్నని గీత గీసి, ఆ చేతిని పిడికిలిగట్టిగా బిగించి పట్టుకోమన్నాడు. ఆమె అలాగే చేసింది.

తరవాత ఆయన తపనకుమారుడి చేతిలో రెండు గీతలు, ఒక దానికి ఒకటి అడ్డంగా సిందూరంతో గీశాడు. తరవాత ఆయన వాన్ని తన చేతిరుమాలుతో తుడిచేసి, ''అనుసుయాదేవి మీ జీవితంలో అంతర్భాగమని చెప్పాను. అందుకు ఇదే నిదర్శనం! ఆమె చేతిమీద ఒకే ఒక గీత గీశాను. కాని మీ చేతి మీది అడ్డగీతలు ఆమె చేతికి మారాయి.'' అన్నాడు.

అనుసుయా పిడికిలి విప్పేసరికి దాని మీద రెండు గీతలు, ఒక దానికి ఒకటి అడ్డంగా కనిపించాయి. తపనకుమారుడు సిగ్గుపడి తలవంచుకుని, తన భార్యకు క్షమాపణ చెప్పుకుని, ఆమె పట్ల ఎన్నటికీ విముఖంగా ఉండనని మాట ఇచ్చాడు.

శివానుగ్రహం వల్ల కాలక్రమాన అనుసుయా మగబిడ్డను కన్నది.

చంటిబిడ్డను తీసుకుని ఆమె తన తండ్రి వద్దకు వెళ్ళినప్పుడు, ఆమె తన తండ్రి ఆస్థాన ఇంద్రజాలికుణ్ణి కలుసుకుని, ''మహామంత్రి చేసిన ఇంద్రజాలంలో కిటుకు మహామంత్రి నడిగితే చెప్పలేదు. ఏమిటా రహస్యం?'' అని అడిగింది.

''అందులో పెద్ద రహస్యం ఏమీ లేదమ్మా. సిందూరం చేతికి సులువుగా అంటుకుంటుంది. ని హస్తరేఖకు ఏటవాలుగా గీసిన సిందూరం గీత, నువ్వు చెయ్యి మూసినప్పుడు హస్తరేఖ వెంబడి అంటుకున్నది,'' అన్నాడు మాయాధరుడు.

ఆమె అదృష్టరేఖ ఆమె అదృష్టాన్ని కాపాడింది.



# కీడెంచితే మేలు!

పంచమహా పాతక మహారాజు దగ్గిరికి భటులు వెంకయ్యనూ, సుబ్బయ్యనూ తెచ్చారు. వెంకయ్య వీధి ప్రదర్శన చూస్తూండగా సుబ్బయ్య అతడి చేతి ఉంగరం లాగేశాడట. సుబ్బయ్యను వెంకయ్య భటులకు పట్టి ఇచ్చాడు. వాళ్ళు సుబ్బయ్య నుంచి ఉంగరం తీసుకుని, ఇద్దరినీ రాజు వద్దకు తెచ్చారు. ఆ మాట నిజమేనని సుబ్బయ్య ఒప్పుకున్నాడు.

"సుబ్బయ్యకు నీ ఉంగరం దొంగిలించాలన్న దుర్బుద్ధి పుట్టటానికి నువు దాన్ని ధరించడమే కారణం. తప్పు నీదే. అసలు నీకీ ఉంగరం ఎలా వచ్చింది?" అని రాజు అడిగాడు. తన మామగారు ఇచ్చారన్నాడు వెంకయ్య.

వెంకయ్య మామను పిలిచి రాజు, "ఈ ఉంగరం నీకెక్కడిది?" అని అడిగాడు.

"మా పట్నం షరాబు దగ్గిర కొన్నానండి," అన్నాడు మామ. షరాబును పిలిపించి, ఈ ఉంగరం నీ కెలా వచ్చిందని అడిగితే, జూదరి సోములు దగ్గిర కొన్నానన్నాడు.

సోములును పిలిపించి, "నీకు ఈ ఉంగరం ఎలా వచ్చింది?" అని అడిగాడు రాజు.

"ప్రభువులు మన్నించాలి. తమ యువరాజా వారు జూదంలో ఓడిపోయి, దీన్ని నా కిచ్చారు," అన్నాడు సోములు.

రాజు కొంచెం ఆలోచించి ఇలా తీర్పు చెప్పాడు:

"మాది న్యాయమైన సొమ్ము కనక మాకే చేరింది. ఇలా జరగటానికి ముఖ్యకారకుడు సుబ్బయ్య. అతను దీన్ని దొంగిలించి, పట్టుబడి మాకు చేర్చాడు. అతడికి నూరు వరహాలూ, సద్గుణశ్రీ అనే బిరుదూ ఇస్తున్నాము. పోతే, ఈ ఉంగరాన్ని ఇన్ని నాళ్ళుగా ధరించినందుకు వెంకయ్యకు నూరు వరహాలు జరిమానా విధిస్తున్నాము."

కీడు తల పెట్టిన సుబ్బయ్యకు మేలే జరిగింది. —కె. అన్నపూర్ణ





# పచ్చల జాడీ

మగధ రాజ్యం లోని చక్రపురం అనే ఊళ్ళో శ్రీగుప్తుడు అనే ధనవంతుడైన వర్తకుడు ఉండేవాడు. అతనికి అపూర్వ వస్తువులంటె సరదా. ఆ సరదాకొద్దీ వాటిని ఎంత డబ్బయినా పోసి కొనేవాడు. ఆ సంగతి తెలిసి ఎందరో వర్తకులు అలాంటి వస్తువులు తెచ్చి అతనికి అమ్మేవారు. అతను కూడా అటువంటి వస్తువులు ఎక్కడున్నా తెచ్చి తనకే అమ్మమని చెబుతూ ఉండేవాడు.

ఒకసారి ఒక వర్తకుడు శ్రీగుప్తుడి దగ్గరికి వచ్చి అపూర్వ వస్తువులు కొన్ని చూపించాడు. శ్రీగుప్తుడు వాటినన్నిటినీ కొన్నాడు. అన్నీ కొనడం అయిపోయాక వర్తకుడు శ్రీగుప్తుడితో, "నా దగ్గర మరో అపూర్వ వస్తువు ఉంది. అయితే నేను దాన్ని అమ్మదలచుకో లేదు. ఎన్నో అపూర్వ వస్తువులు సేకరించిన మీ దగ్గర కూడా ఇలాంటి వస్తువు లేదు," అన్నాడు. శ్రీగుప్తుడికి ఆ వస్తువు ఏదో చూడాలన్న కుతూహలం కలిగింది. అతను తనకా వస్తువును ఒకసారి చూపించమని వర్తకుణ్ణి అడిగాడు.

శ్రీగుప్తుడి కోరిక ప్రకారం ఆ వర్తకుడు తనతో తెచ్చిన ఒక పెట్టె తెరిచి అందు లోంచి ఒక పచ్చల జాడీ తీశాడు. ఆ జాడీ అద్భుతంగా ఉంది. దానిమీద అందమైన తీగెలూ, పూలూ చెక్కి ఉన్నాయి. ఆ జాడీని చూడగానే శ్రీగుప్తుడికి దాన్ని ఎంత డబ్బయినా పెట్టి కొనాలనిపించింది. అయితే వర్తకుడు మాత్రం శ్రీగుప్తుడు ఎంత డబ్బు ఇచ్చినా తాను జాడీ అమ్మదలుచుకోలేదని చెప్పి వెళ్ళిపోయాడు.

శ్రీగుప్తుడికి మాత్రం తాను అన్నాళ్ళూ సేకరించిన అపూర్వ వస్తువులన్నీ కలిపినా ఆ పచ్చల జాడీకి సరితూగవనిపించింది.

డా. ఏ. సరస్వతి

అది తన దగ్గర లేకపోవడం పెద్ద కొరత అనుకున్నాడు అతను.

మరో వారం రోజుల తరవాత పచ్చల జాడీ వర్తకుడు మళ్ళీ శ్రీగుప్తుడి ఇంటికి వచ్చాడు. తనకు వ్యాపార విషయంగా ఎంతో డబ్బు కావాలనీ, మరో గత్యంతరం లేనందువల్ల పచ్చల జాడి అమ్మదలచుకున్నాననీ అన్నాడు. శ్రీగుప్తుడు ఆ మాటలు విని ఎంతో సంతోషించి, వర్తకుడు అడిగినంత డబ్బూ ఇచ్చి జాడీని కొన్నాడు.

ఆ తరవాత కొద్ది రోజులకే శ్రీగుప్తుడి వద్ద పనిచెయ్యటానికి మాధవుడు అనే పేదయువకుడు వచ్చాడు. కొద్ది కాలంలోనే అతను తన యజమాని అభిమానానికి పాత్రుడై, అతనికి కుడిభుజంలాగా అయిపోయాడు. శ్రీగుప్తుడు మాధవుడికి తన వద్ద ఉన్న అపూర్వ వస్తువులన్నీ చూపుతూ, పచ్చల జాడీ కూడా చూపించాడు. అన్నిటికన్నా పచ్చల జాడీ అద్భుతంగా ఉన్నదని మాధవుడు చెప్పాడు.

రోజూ మాధవుడు శ్రీగుప్తుడి వెంట సమీపంలో ఉన్న చిట్టడవికి షికారు వెళ్ళేవాడు. ఒకరోజు అతను దాహంగా ఉందని చెప్పి, దగ్గరలో ఉన్న కొలనులో నీళ్ళు తాగడానికి వెళ్ళాడు.

ఒంటరిగా ఉన్న శ్రీగుప్తుడికి ఒక స్త్రీ కంఠం, " రక్షించండి! రక్షించండి! " అని ఆర్తనాదం చెయ్యడం వినిపించింది. వెంటనే అతను ఆ కేక వినిపించిన దిక్కుగా వెళ్ళాడు.



కొంత దూరం వెళ్ళాక అతనికి ఒక కుటీరం ముందున్న రేగుపొదలో పళ్ళు కోసుకుంటున్న ఒక అందమైన యువతి కనిపించింది.

శ్రీగుప్తుడు ఆమె దగ్గరికి వెళ్ళి, " అమ్మాయీ, ఇంతకుముందు ఎవరో రక్షించమని కేకలు పెట్టారు. నీకేమైనా తెలుసునా? " అని అడిగాడు.

ఆమె నవ్వి, " కేకలా? నాకేమీ వినిపించలేదే! మీరు భ్రమపడి ఉంటారు, " అన్నది.



శ్రీగుప్తుడు వెనక్కు తిరిగి వస్తుండగా, అతణ్ణి వెదుక్కుంటూ మాధవుడు ఎదురుగా వచ్చాడు. ఎవరైనా స్త్రీ ఆర్తనాదం వినిపించిందా అని శ్రీగుప్తుడు మాధవుణ్ణి అడిగితే, ఆతను తన కేమీ వినిపించలేదన్నాడు. శ్రీగుప్తుడికి మతిపోయినట్టయింది. ఇద్దరూ కలిసి ఇంటికి నడిచారు.

మర్నాడు సాయంకాలమూ, ఆ మర్నాడు సాయంకాలమూ కూడా చిట్టడవిలో శ్రీగుప్తుడు ఒంటరిగా ఉన్నప్పుడు, "రక్షించండి!" అంటూ ఆడదాని ఆర్తనాదం వినిపించడమూ, అతను పరుగు పరుగున కుటీరం వైపు వెళ్ళడమూ, అతను అడిగిన ప్రశ్నకు ఆ యువతి నవ్వడమూ జరిగాయి.

తనకు నిజంగానే చిత్తభ్రమ కలుగుతున్నదేమో నని శ్రీగుప్తుడు అనుమానించాడు. లేదా ఆ చిట్టడవిలో ఏ మోహినీ పిశాచమైనా ఉండి ఉండాలి అనుకున్నాడు అతను. అతను తన అనుమానాలు మాధవుడితో చెబితే, మాధవుడు కూడా ఆశ్చర్యపోయాడు.

ఆ తరవాత వాళ్ళు చిట్టడవివైపు పోవడం మానేశారు.

ఒక వారం రోజులు గడిచాక, చిట్టడవిలో ఉండే యువతి శ్రీగుప్తుణ్ణి చూడవచ్చి నమస్కరించి, "అయ్యా, నా పేరు చారుమతి. నేను ఆ చిట్టడవిలో మీరు చూసిన కుటీరంలో మా నాన్నతోబాటు వున్నాను. మీరు అక్కడికి రావడం మానుకున్న దగ్గరినుంచీ ప్రతిరాత్రీ ఒక స్త్రీ కంఠం 'రక్షించండి! రక్షించండి!' అని అరవడం వినిపిస్తున్నది. బయటికి పోయి చూస్తే ఎవరూ ఉండరు. నిన్న రాత్రి ఒక విచిత్రమైన కల వచ్చింది. నా మంచం దగ్గర ఒక స్త్రీ మౌనంగా ఏడుస్తూ నిలబడి ఉంది. ఆమె చేతిలో ఒక పచ్చల జాడీ ఉన్నది. ఆమె ఏమీ అనకుండానే ఆ జాడీ చూపిస్తూ ఏడుస్తూ ఉన్నది," అన్నది.

ఆ మాటలు విని శ్రీగుప్తుడు అదరి పడ్డాడు. అయినా అతను తన అదురు పాటును కప్పిపుచ్చుకుంటూ మాధవుణ్ణి పిలిచాడు. మాధవుడు వచ్చి సంగతి తెలుసుకుని లోపలికి వెళ్ళి పచ్చల జాడీ తెచ్చాడు. దాన్ని చూస్తూనే చారుమతి ఆశ్చర్యంతో, "అదే! అదే!" అని అరిచింది.

ఆ జాడీ మీద మంత్రాల వంటివి ఏవైనా ఉన్నాయా అని ముగ్గురూ పరీక్షించారు. దాని మీద గానీ, లోపల గానీ, క్రింద గానీ ఎక్కడా ఏమీ కనిపించలేదు.

"మన మిద్దరమూ ఈ జాడీ తీసుకుని చారుమతి కుటీరానికి వెళ్ళి, తెల్లవార్లూ మేలుకుని ఉండి, దీని రహస్యం తెలుసుకుందాం," అని మాధవుడు శ్రీగుప్తుడితో అన్నాడు. శ్రీగుప్తుడు ఒప్పుకున్నాడు.

చీకటి పడేవేళకు ముగ్గురూ చారుమతి కుటీరానికి చేరుకున్నారు. పచ్చల జాడీని చిన్న బల్లపైన ఉంచారు. ఆ రాత్రి చారుమతి తన అతిథులకు ఏవో పళ్ళూ, పానీయాలూ ఇచ్చింది. అర్ధరాత్రి దాటే వేళకు ఎంత ఆపుకున్నా నిద్ర ఆగలేదు శ్రీగుప్తుడికి. అప్పటికే చారుమతీ, మాధవుడూ నిద్రలో ఉండడం కనిపించింది అతనికి.

శ్రీగుప్తుడికి తిరిగి తెలివి వచ్చేసరికి బాగా ఎండ ఎక్కి ఉన్నది. అతను తన చుట్టూ ఉన్నవారిని చూసి ఆశ్చర్యపడ్డాడు. అతనికి మాధవుడు, చారుమతి ఇద్దరేకాక



రాజభటులూ, పచ్చల జాడీ వర్తకుడూ, అంతకుముందు తనకు అపూర్వ వస్తువులు అమ్ముతూ వచ్చిన మరో ఇద్దరూ, మరో ముగ్గురు పెద్దమనుషులూ అక్కడ కనిపించారు. తాను సేకరించిన అపూర్వ వస్తువులలో కొన్ని కూడా ఆ కుటీరంలో ఉండడం గమనించాడు అతను. ఏం జరుగుతున్నదో శ్రీగుప్తుడికి ఎంత ఆలోచించినా అంతుచిక్కలేదు.

అప్పుడు మాధవుడు శ్రీగుప్తుణ్ణి చూసి, "అపూర్వ వస్తువులు సంపాయించాలనే మీ కోరిక ఎలాంటి ఫలితాలు తెచ్చిందో మీకు నిరూపించడం కోసం ఇలా చెయ్యవలసి వచ్చింది. నేను మగధరాజ్యాధికారులలో ఒకణ్ణి. రాజ్యంలోని చాలా మంది ధనవంతులూ, పండితులూ తమ వద్ద ఉన్న అపూర్వ వస్తువులను ఎవరో దొంగిలిస్తున్నారని తరచుగా వచ్చి చెప్పసాగారు. అందుకు తగ్గట్టు రాజభవనంలోని పచ్చల జాడీ కనబడక పోయేసరికి నేనూ విచారణ ప్రారంభించాను. అలా నేను మీ యింట పనికి కుదిరాను. మీ వ్యవహారం గమనించాను. మీ సరదా-మీకు అపూర్వ వస్తువులు అమ్ముతూ వచ్చిన వారిని ఈ పెద్దమనుషుల ఇళ్ళనుంచి వస్తువులు దొంగిలించడానికి పురికొల్పింది. మీరు ఆ వస్తువులు ఎక్కడివో, ఎలా తెస్తున్నారో తెలుసుకోకుండా కొనడం వల్ల వీళ్ళు విచ్చలవిడిగా దొంగతనాలు చేస్తున్నారు!" అన్నాడు.

శ్రీగుప్తుడికి అవమానమూ, బాధా కలిగాయి. దాంతో అతను తన దగ్గర ఉన్న అపూర్వ వస్తువులన్నిటినీ మాధవుడికి అప్పగించాడు. మాధవుడు వాటిలో దొంగిలింపబడ్డ వస్తువులను వాటి యజమానులకు అందజేసి, తక్కినవాటిని ప్రభుత్వం వారి ప్రదర్శనశాలలో ఉంచడానికి ఏర్పాటు చేశాడు.

శ్రీగుప్తుడు తన సరదా వల్ల డబ్బు నష్టమే తప్ప మరే లాభమూ లేదని గ్రహించి అప్పటినుంచి తన వ్యాపారం పట్ల శ్రద్ధచూపసాగాడు.



# న్యాయమైన బేరం

విజయనగరంలో ఒక సంపన్నుడైన వర్తకుడు తాను ఉంటున్న తాతల నాటి పాత భవనాన్ని పడగొట్టి, అదే స్థలంలో మరొక భవనం కట్ట తలపెట్టాడు. కొత్త భవనానికి శంకుస్థాపన జరప టానికి కొద్ది రోజులలో మంచి ముహూర్తం ఉన్నది. కాని ఈలోగా పాత భవనాన్ని పడకొట్టా లంటే చాలా మంది కూలీలు కావాలి.

అయితే ఆ సమయంలో శ్రీకృష్ణదేవరాయలు ఎక్కడో కోట కట్టిస్తుంటే నగరంలోని కూలీలందరూ అక్కడికి వెళ్ళారు. అందుచేత వర్తకుడికి అతికష్టం మీద పది మంది కూలీలు దొరికారు. భవనం పడగొట్టే పని వాళ్ళకు అప్పగించి, కొంతమంది కూలీలను అదనంగా తెస్తానని, అతను ప్రయాణమై వెళ్ళాడు.

కూలీలు పాత భవనాన్ని పడగొట్టుతుంటే అక్కడక్కడా గోడలలో బంగారు నాణాలూ, వెండి నాణాలూ బయట పడ్డాయి. వాళ్ళకు ఉత్సాహం వచ్చి, విరామం లేకుండా పగలూ, రాత్రి పనిచేసి, పడిపోయిన పెళ్లలను దూరంగా తీసుకుపోయి, నాణాల కోసం గాలిస్తూ నాలు గైదు రోజులలోగా పునాదులతో సహా పాతభవనం తవ్వేసి, ఆ ప్రదేశమంతా శుభ్రం చేసేశారు.

కూలీలు దొరకలేదని వర్తకుడు తిరిగి వచ్చేసరికి పని పూర్తి కానే అయింది. నాణాలు దొరికిన సంగతి కూలీలు వర్తకుడికి చెప్పక, వాటిని తమలో తాము పంచుకున్నారు. వర్తకుడికి కూడా నష్టం కలగలేదు. అతను గోడలలో అక్కడక్కడా పెట్టిన నాణాలు న్యాయంగా ఇల్లు పడగొట్టటానికి కేటాయించినవే.

— మల్లాది వెంకటకృష్ణమూర్తి





# లంకెబిందెలు

పూర్వం ఒక రాజు వద్ద ఏకనాధుడు అనే అంతరంగికుడు ఉండేవాడు. అతను రాజుకు చాలా విశ్వాసపాత్రుడు.

ఒకనాడు ఏకనాధుడు తన ఇంటి పెరడులో ఎగుడు దిగుడుగా ఉన్న ప్రదేశాన్ని చదును చేస్తూండగా, పూర్వ కాలంనాటి లంకె బిందెలు బయట పడ్డాయి. వెంటనే అతను భార్యను పిలిచి, వాటిని చూపించాడు. ఆమె వాటిని చూసి కళ్ళు పెద్దవిచేసి, గుండెల పైన చేతులు వేసుకున్నది.

ఏకనాధుడు బిందెల మూతలు విప్పబోతూంటే, ఆమె అడ్డుపడి, "మంచి ముహూర్తం చూసిగాని లంకె బిందెల మూతలు విప్పరాదు. లేకపోతే వాటిలోని ధనం చిల్లపెంకుల్లాగా కనిపిస్తుంది. ముందు వీటిని ఇంట్లో దాచిపెడదాం, పదండి." అన్నది.

ఏకనాధుడు భార్య కేసి ఆశ్చర్యంగా చూసి, "భూమిలో దొరికిన నిక్షేపం న్యాయంగా రాజుకు చెందాలి. అది మనది ఎలాగవుతుంది?" అన్నాడు.

"మన ఇంట్లో దొరికినది రాజు సొత్తు ఎలా అవుతుంది? దాన్ని మనమే అనుభవించాలి," అన్నది భార్య.

ఆమెతో వాదించటం ఇష్టంలేక, ఏకనాధుడు లంకె బిందెలను లోపలికి తీసుకుపోయి, అటక మీద దాచాడు.

ఇదంతా పొరుగింటి పుండరీకాక్షుడు అనుకోకుండా చూశాడు. అతను తిన్నగా గ్రామాధికారి ఇంటికి వెళ్ళి, "అయ్యా, నాకొక చిన్న ధర్మసందేహం కలిగింది. భూమిలో దొరికిన ధనం ఎవరికి చెందుతుంది?" అని అడిగాడు.

"ధనం ఎవరికి, ఎక్కడ దొరికినప్పటికీ రాజుగారికే చెందుతుంది.

వీరేపల్లి జయరాంరెడ్డి



ఇంతకూ ఇప్పుడు నీకు ఈ సమస్య ఎందుకు వచ్చిందీ?'' అని గ్రామాధికారి పుండరీకుణ్ణి అడిగాడు.

పుండరీకుడు గ్రామాధికారికి తాను చూసినది చెప్పాడు. ''ఆ లంకెబిందెలను రాజుకు అప్పగిస్తే నీకూ, నాకూ ఒరిగే దేమిటి? వాటిని దొంగిలించటానికి మాకు సహాయం చేసి, సగంవాటా తీసుకో. ఏమంటావు?'' అన్నాడు గ్రామాధికారి.

అందుకు పుండరీకుడు సంతోషంగా ఒప్పుకొని ఇంటికి వెళ్ళిపోయాడు.

ఈ గ్రామాధికారి కర్కోటకుడు. అతను వీరకుడు అనే వాడి చేత అడ్డమైన దారుణాలూ చేయిస్తూ, గ్రామప్రజలకు సింహస్వప్నంగా వుంటూ, తాను మాత్రం దొరికిపోయేవాడు కాడు.

ఆ రాత్రి కొంచెం పొద్దుపోయాక, తన భార్య నిద్రపోగానే, ఏకనాథుడు మెల్లిగా పక్కమీదినుంచి లేచి, లంకె బిందెలను పెరట్లోకి తీసుకుపోయి, వాటిలోని ధనాన్ని ఒక గుడ్డలో మూట కట్టి, బిందె లను చిల్లపెంకులతో నింపి, లోపలికి తెచ్చి యథాస్థానంలో పెట్టి, ఆ మూటను ఇంట్లోనే దాచి, నిశ్చింతగా పడుకుని నిద్రపోయాడు.

అర్ధరాత్రివేళ న్యాయాధికారి వీరకుణ్ణి పిలిపించి, వాడికి చెప్పవలసినదంతా చెప్పి, పుండరీకుడి ఇంటికి పంపాడు. పుండరీకుడి సహాయంతో వీరకుడు లంకె బిందెలను దొంగిలించాడు. తన వంతు బిందెను పుండరీకుడు తీసుకుని తన ఇంటికి పోవటానికి వెనక్కు తిరగగానే, వీరకుడు వెనకనుంచి పుండరీకుడి తల మీద తన చేతిలో ఉన్న బిందెతో బలంగా కొట్టాడు. పుండరీకుడు స్పృహతప్పి పడి పోయాడు. వీరకుడు అతని చేతులూ, కాళ్ళూ కట్టి తీసుకుపోయి, అతని దొడ్లో పడేశాడు. ఇది గ్రామాధికారి ఆలోచనే!

తరవాత వీరకుడు లంకె బిందెలతో తిన్నగా గ్రామాధికారి ఇంటికి వెళ్ళక, తన ఇంటి దారి పట్టాడు. తాను ఇంత

శ్రమపడి సంపాదించిన ధనం గ్రామాధికారికిస్తే అందులో తనకు ఏంత ముట్టుతుందోనని వాడికి అనుమానం వచ్చింది.

అయితే ఇంటికి పోతున్న వీరకుడి నెత్తి మీద ధనామని కర్రదెబ్బ పడింది. వాడు స్పృహతప్పి పడిపోయాడు. వాణ్ణి నమ్మలేక గ్రామాధికారి దగ్గిరలోనే పొంచి ఉండి, వాడి ఎత్తు తెలియగానే వాడి తలమీద కొట్టి, వాణ్ణి పొదలలోకి ఈడ్చి, లంకె బిందెలు తీసుకుని తన ఇంటికి వెళ్ళిపోయాడు. అతను ఇంటికి పోయి ఆత్రంగా చూసుకుంటే లంకె బిందెల నిండా చిల్లపెంకులు తప్ప ఏమీలేవు.

తెల్లవారుతూనే ఏకనాథుడు తన భార్యకు తెలియకుండా ధనపు మూటతో రాజుగారి వద్దకు వెళ్ళి, లంకె బిందెల మాట చెప్పి, ధనం రాజుగారి ముందు పెట్టాడు. అదే సమయంలో, అతని పొరుగున ఉండే పుండరీకుడు గ్రామాధికారి మీద రాజుగారికి ఫిర్యాదు చెయ్యటానికి వచ్చి, ఎడంగా నిలబడ్డాడు.

రాజు ఏకనాథుడితో, ''ఇంతకూ బిందెలు ఏవీ?'' అన్నాడు.

వెంటనే పుండరీకుడు, ''మహారాజా, అవి మా గ్రామాధికారి ఇంట్లో దొరుకుతాయి.'' అని జరిగినదంతా దాచకుండా చెప్పాడు. తనకు శిక్షపడినా సరే, గ్రామాధికారికి శిక్షపడాలని అతనికి కక్షగా ఉన్నది.

రాజు ఏకనాథుడి నిజాయితీకి సంతోషించి, బిందెలలో దొరికిన ధనాన్ని అతన్నే తీసుకోమన్నాడు. అప్పటి కప్పుడే ఆయన తన భటులను పంపి, గ్రామాధికారి ఇల్లు సోదా చేయించి, అక్కడ బిందెలు దొరికినందున అతనికి తీవ్రమైన శిక్ష విధించాడు.

ఏకనాథుడు ధనంతో ఇంటికి తిరిగి వచ్చేసరికి అతని భార్య, ''లంకె బిందెలను ఎవరో దొంగిలించుకు పోయారండీ!'' అన్నది.

''బిందెలు పోతే పోయాయిలే. అందులోని ధనం మన దగ్గిరే ఉన్నది.'' అంటూ ఏకనాథుడు ధనాన్ని ఆమెకు చూపాడు.





# వీర హనుమాన్

తరవాత రాముడు ఆజ్ఞాపించగా, వానరులు గుంపులు గుంపులుగా అరణ్యంలోకి వెళ్ళి, రకరకాల చెట్లను పెల్లగించుకుని వచ్చి సముద్రంలో వేయనారంభించారు. ఇంకా బలవంతులు ఏనుగులంతేసి రాళ్ళను తెచ్చి సముద్రంలో వేస్తూంటె సముద్రపు నీరు ఆకాశమంత ఎత్తు ఎగిరింది. సముద్రమంతా కెలకబారింది.

ఈ విధంగా తయారవుతున్న సేతువు ఎగుడు దిగుడు కాకుండా కొందరు తాళ్ళు పట్టుకున్నారు; కొందరు కొలత బద్దలు ఉపయోగించారు. నలుడు తలపెట్టిన సేతువు పదియోజనాల వెడల్పూ, నూరు యోజనాల నిడివీగలది. రోజుకు సుమారు ఇరవైయోజనాల చొప్పున, అయిదు రోజులలో సేతువు నిర్మాణం పూర్తి అయింది. నలుడి సామర్థ్యం వల్లనే ఆ పని విజయవంతంగా జరిగింది. వానరులు పరమానందంతో అటూ ఇటూ ఎగిరారు.

చక్కని రాజమార్గంలాగా తయారైన ఆ సేతువు మీద వానరసేనలు సముద్రాన్ని దాటి అవతలి ఒడ్డు చేరాయి. శత్రువులు వస్తే చంపటానికి విభీషణుడు గదతీసుకుని, తన నలుగురు అనుచరులతో సహా సేతువు అవతలి చివర నిలబడ్డాడు.

సేతువును దాటేటప్పుడు హనుమంతుడి మీద రాముడూ, అంగదుడి మీద లక్ష్మణుడూ ఎక్కి కూర్చున్నారు. వాళ్ళు కాలినడకన సేతువును దాట

21. వానరసేనల లంకా ప్రవేశం



టానికి సుగ్రీవుడు ఒప్పుకోలేదు. హనుమంతుడూ, అంగదుడూ కూడా ఆకాశగమనంతోనె రామ, లక్ష్మణులను చేరవేశారు. మరికొందరు వానరులు కూడా గాలిలో ఎగురుతూపోయారు. వానరులు అధిక సంఖ్యలో ఉండటం చేత రద్దీ ఎక్కువై, కొందరు సముద్రంలో పడి, పైకి వచ్చారు. సేతువు దాటేటప్పుడు వానరులు చేసిన కోలాహలంలో సముద్రఘోషకూడా వినిపించలేదు.

సముద్రం అవతలి ఒడ్డున ఫలసమృద్ధిగల అరణ్యాలూ, వానరసేన విడియటానికి తగిన ప్రదేశాలూ ఉన్నాయి. కాని రాముడు వెంటనే లంకానగరం కేసి వానరసేనను నడిపించ నిర్ణయించాడు. రాముడు ముందు నడవగా వానరులు సింహనాదాలు చేస్తూ లంకానగరానికి బయలుదేరారు. వానరుల ఉత్సాహం చూసి రాముడు సంతోషించాడు.

వానరసేన లంకానగరం బయట విడియగానె నగరంలో నుంచి భేరుల ధ్వనులూ, మృదంగాల ధ్వనులూ, రాకసుల ఆర్భాటాలూ వినవచ్చాయి. వానరులకు కోపం వచ్చి, అంతకంటె గట్టిగా సింహనాదాలు చేశారు. లంకలో ధ్వజాల మీద ఎత్తిన రకరకాల పతాకలను చూస్తూ, రాముడు సీతను తలచుకుని దుఃఖించాడు.

అతను లక్ష్మణుడితో, "త్రికూట పర్వతం మీద ఆకాశాన్ని అంటుతున్నట్టుగా విశ్వకర్మ నిర్మించిన ఆ లంకా నగరాన్ని చూడు." అన్నాడు.

తరవాత అతను వానరసేనను వ్యూహంగా ఎలా అమర్చాలో చెప్పాడు. అంగదుడు నీలుడితో సహా తన సేనను వ్యూహం మధ్య ఉంచాలి. ఋషభుడూ, అతని సేనా కుడిపార్శ్వంలో ఉంటారు. గంధమాదనుడు తన సేనతో సహా ఎడమ పార్శ్వంలో ఉంటాడు. రామ, లక్ష్మణులు వ్యూహం ముందు ఉంటారు. సుగ్రీవుడు సేనల వెనకపక్క ఉంటాడు. మొత్తం

వానరసేన గరుడ వ్యూహంలో అమర్చబడింది. లంకను పిండి కొట్టాలని వానరులకు మహా ఆత్రంగా ఉన్నది.

రాముడు సుగ్రీవుడితో, "రావణుడి దూత అయిన శుకుణ్ణి ఇప్పుడు వదిలిపెట్టు," అన్నాడు.

వానరుల చేత నానాబాధలూ పడి, ప్రాణభయంతో కొట్టుకుంటున్న శుకుడు, తనను సుగ్రీవుడు విడిచిపెట్టగానే వేగంగా రావణుడి వద్దకు వెళ్ళాడు. రావణుడు శుకుణ్ణి చూసి నవ్వుతూ, "రెక్కలు తెగినట్టుగా కనబడుతున్నాయి. వానరులకు దొరికిపోలేదు కద?" అని అడిగాడు. శుకుడు రావణుడితో ఇలా అన్నాడు :

"నేను సముద్రం అవతలి గట్టుకు ఎగిరి వెళ్ళి, సుగ్రీవుడితో నువు చెప్పమన్నమాటలే పొల్లులేకుండా చెప్పాను. వానరులకు కోపం వచ్చి, ఎగిరి నన్ను పట్టుకుని, చిత్రహింసలు పెట్టారు. ఆ వానరులు మాట్లాడరు, మాట్లాడితే వినరు. వాళ్ళ నుంచి జవాబు సంపాదించటం ఎలా? వాళ్ళు ముక్కోపులూ, క్రూరులూనూ. సముద్రానికి సేతువు కట్టి, సముద్రం దాటి రాముడు లంకాద్వారాన్ని చేరాడు. ఎలుగుబంట్లూ, వానరులూ నేల ఈనినట్టుగా భూమినంతా ఆక్రమించి ఉన్నారు. వానరులకూ, రాకసులకూ యుద్ధం తప్పదు. వానరులు ఏ క్షణాన అయినా లంకా ప్రాకారాలను ఎక్కవచ్చు.





ఇస్తే సీతను రాముడికి ఇయ్యి, లేదా యుద్ధం చెయ్యి.''

ఈ మాట వినగానే రావణుడికి కోపంతో కళ్ళు ఎర్రబడ్డాయి.

''లోకాలన్నీ నా మీదికి వచ్చినా నేను సీతను ఇయ్యను. చాలాకాలంగా యుద్ధం లేక నా భుజాలు తీటగా ఉన్నాయి. నా సంగతి తెలియక రాముడు నా మీదికి యుద్ధానికి వచ్చాడు. నా బాణాలదెబ్బ అతను ఓరగడు.'' అన్నాడు రావణుడు.

అతను తన మంత్రులైన శుక, సారణులతో, ''సముద్రానికి సేతువు కట్టటమనేది అపూర్వం. నేను నమ్మను! మీరు రహస్యంగా వెళ్ళి, నిజంగా సేతువు నిర్మాణం జరిగిందో లేదో, వానరసేన ఏపాటి ఉన్నదో, రాముడి అస్త్రశస్త్రాలు ఏవో తెలుసుకుని రండి.'' అన్నాడు.

వాళ్ళిద్దరూ వానరరూపాలు ధరించి, వానరసేనలో ప్రవేశించారు. అంతులేని వానరసేనను లెక్కించటం వారికి సాధ్యం కాలేదు. వానరసేన సమస్త ప్రదేశాలనూ ఆక్రమించటమే గాక, ఇంకా కొంత సేన సేతువును దాటి వస్తూనే ఉన్నది.

ఇంతలో విభీషణుడు వాళ్ళిద్దరినీ పోల్చి పట్టుకుని, రాముడితో, ''వీళ్లు శుక, సారణులు అనే రాక్షసులు. రావణుడి మంత్రులు. వానరరూపాలతో, మన రహస్యాలు తెలుసుకునేటందుకు లంక నుంచి వచ్చారు.'' అని చెప్పాడు.

అప్పుడు వాళ్ళిద్దరూ రాముడికి దణ్ణం పెట్టి, విభీషణుడు చెప్పినది నిజమేనని ఒప్పుకున్నారు. రాముడు నవ్వి, ''మా సైన్యమంతా చూడండి. మమ్మల్ని చక్కగా పరీక్షించండి. తరవాత లంకకు తిరిగి పొండి. మీరు చూడటం పూర్తి కాకపోతే విభీషణుడు మీకు సేన అంతా చూపుతాడు. మీరు నిరాయుధులు గనక మిమ్మల్ని చంపరాదు.'' అంటూ, వాళ్లను పోనియ్యమని విభీషణుడితో చెప్పాడు.

రాముడు వాళ్ళద్వారా రావణుడికి ఒక సందేశం కూడా పంపాడు. అదేమి

టంటే: "రావణుడా. రేపు తెల్లవారుతూనే నా కోపాన్ని నీపై వజ్రాయుధంలాగా ప్రయోగించ బోతున్నాను.''

శుక, సారణులు రాముడికి జయం పలికి. రావణుడి వద్దకు వెళ్ళి. ''రాజా. వానరసేనలో ప్రవేశించిన మమ్మల్ని విభీషణుడు పోల్చిపట్టుకుని. రాముడికి అప్పగించాడు. రాముడు మమ్మల్ని దయ దలచి విడిచిపుచ్చాడు. ఆమాట అటుంచి. ఆ వానరసేనకు రామ. లక్ష్మణ. విభీషణ. సుగ్రీవులున్నారు. ఇంకేం కావాలి. రాముడి బాణాలు చూస్తే. అతనికి ఎవరి సహాయమూ అవసరం లేదనే అనిపిస్తుంది. వానరసేన సముద్రం దాటి వచ్చింది. దాని మేర తెలియరావటం లేదు. వానరులు మంచి యుద్ధోత్సాహంలో ఉన్నారు. యుద్ధం మాని. సీతను రాముడికి ఇచ్చెయ్యి.'' అన్నారు.

రావణుడు సారణుడితో. ''సీతను ఇయ్యను. నువు సౌమ్యుడివి. శూరుడివి కావు. వానరసేనను చూసి దడుచుకున్నావు. నన్ను యుద్ధంలో ఎవడు జయించగలడు?'' అన్నాడు.

అతనికి వానరసేనను చూడాలనిపించింది. అతను తన మేడపై భాగానికి ఎక్కి. లంకానగరం చుట్టూ గల పర్వతాలూ. అరణ్యాలూ వానరమయంగా ఉండటం గమనించాడు. అతను తన సమీపంలో ఉన్న సారణుడితో. ''ఈ సేనలో బలవంతులూ. శూరులూ,





యుద్ధంలో ప్రముఖంగా పోరాడగలవారూ ఎవరు? ముఖ్యసేనా నాయకులెవరు? సుగ్రీవుడి సలహాదార్లు ఎవరు?'' అన్నాడు.

దానికి సారణుడు ఇలా చెప్పాడు:

''నీలుడు వానరసేనా నాయకుడు. అంగదుడు వానర రాజ్యానికి యువరాజు. అతను వాలి కొడుకూ, వాలి అంతటి వాడూనూ. హనుమంతుడు మనకు ముందు తెలిసినవాడే. సేతువు నిర్మించిన నలుడు మహాపరాక్రమశాలి. అతని వెంట ఉన్న వానరసేన జయించరానిది. ఆ తెల్లని వానరుడు శ్వేతుడు, యుద్ధంలో మహాభయంకరుడు. ఎరుపు, పసుపు వెంట్రుకలు తోకలోగలవాడు కుముదుడు. ఇతనికి దయాదాక్షిణ్యాలు లేవు. యుద్ధం కోసం తహతహలాడుతున్నాడు.''

ఈ విధంగా చెబుతూ సారణుడు రావణుడికి రంభుడూ, శరభుడూ, పనసుడూ అనే వానర వీరులను గురించీ, ఇతర వానర సేనాపతులను గురించీ చెప్పాడు. తరవాత అతను భల్లూక ప్రముఖులను గురించి కూడా చెప్పాడు. భల్లూకాలలో ప్రముఖుడు జాంబవంతుడు.

సారణుడు వదిలేసిన వివరాలను శుకుడు రావణుడికి చెప్పాడు. హనుమంతుడి సమీపంలో ఉన్న రామలక్ష్ముణులను ఇతనే రావణుడికి చూపాడు. రావణుడు రాముడి సమీపంలో తన తమ్ముడైన విభీషణుణ్ణి కూడా చూశాడు. అతనికి ఒక్క క్షణంపాటు భయం కలిగి, వెంటనే కోపంగా మారింది. శుకసారణులు శత్రువుల శౌర్య పరాక్రమాలను గొప్పగా చెప్పినందుకు అతను వారిని మందలించి, ''మీవంటి మంత్రులను పెట్టుకున్న నేను ఎప్పుడో చచ్చి ఉండవలసింది. మీరు లోగడ చేసిన మేలుతలచి, మిమ్మల్ని చంపకుండా వదులుతున్నాను. వెళ్ళిపొండి,'' అన్నాడు. రావణుడికి జయం పలికి వాళ్ళు వెళ్ళిపోయారు.

తరవాత రావణుడు మహోదరుడితో చెప్పి, కొందరు వేగులవాళ్ళను పిలిపించి,

''రాముణ్ణి గురించి సమస్తమూ తెలుసుకు రండి," అన్నాడు.

ఆ చారులు మారు రూపాలు ధరించి, సువేలపర్వతం దగ్గిరలో ఉన్న రామ, లక్ష్మణ, విభీషణ, సుగ్రీవులున్న చోటికి వెళ్ళారు. రామ, లక్ష్మణులనూ, వానర సేననూ చూస్తూనే వారికి దడపట్టుకున్నది. దానికితోడు విభీషణుడు వాళ్ళను కనిపెట్టి, పట్టుకున్నాడు. ఆ చారులలో శార్దూలుడనేవాడు చాలా దుష్టుడు. వానరులు వాణ్ణి చంపే లోపున రాముడు అడ్డపడి, శార్దూలుడితో బాటు మిగిలిన చారులను కూడా విడిపించాడు. వాళ్ళు కొద్ది దెబ్బలతో తప్పించుకుని లంకకు తిరిగి వెళ్ళారు.

శార్దూలుణ్ణి చూసి రావణుడు ఏదో జరిగిందని గ్రహించాడు. వాడు రావణుడితో, ''వానరులను గురించి తెలుసుకోవటం ఎంత మాత్రమూ సాధ్యం కాదు. నేను విభీషణుడి అనుచరులకు దొరికిపోయాను. తరవాత వానరులు నన్ను నానాహింసలూ పెట్టారు. రాముడు నన్ను వానరుల బారినుంచి రక్షించాడు. అదృష్టం బాగుండి, బతికి బయటపడ్డాను. రాముడు లంకను ముట్టడించటానికి సిద్ధంగా ఉన్నాడు. సీతను రాముడికి ఇయ్యటమో, యుద్ధానికి సిద్ధంకావటమో చెయ్యటం మంచిది.'' అన్నాడు.

రావణుడు సీతనియ్యనని మళ్ళీ చెప్పి, వానర ప్రముఖులను గురించి శార్దూలుడి ద్వారా కూడా తెలుసుకున్నాడు.

తరవాత అతను విద్యుజ్జిహ్వుడనే రాక్షసుణ్ణి వెంట బెట్టుకుని సీత ఉండే చోటికి బయలుదేరాడు. అతను విద్యుజ్జిహ్వుడితో, ''నువ్వు నీ మాయచేత రాముడి తల ఒకటి కల్పించు. దానితో బాటు ఒక గొప్ప ధనుస్సూ, బాణాలూ తయారు చెయ్యి. వాటితో మనం సీతను మోసం చేద్దాం.'' అన్నాడు.

విద్యుజ్జిహ్వుడు సరేనన్నాడు. రావణుడు వాడికి తన ఆభరణం ఒకటి తీసి, బహుమానంగా ఇచ్చాడు.





# అమరవాణి

వసేత్ సహ సపత్నేన క్రుద్ధేనాశీవిషేణవా
న తు మిత్రప్రవాదేన సంవసేత్ శత్రుసేవినా. 1

[శత్రువులతోనూ, విషసర్పాలతోనూ అయినా స్నేహం చెయ్యవచ్చుగాని స్నేహితుడుగా ఉంటూ శత్రుపక్షం వహించిన వాడితో స్నేహం చెయ్యరాదు.]

సత్య మన్యోన్య సంహృష్టా, వ్యసనే హ్యాతతాయినః,
ప్రచ్ఛన్నహృదయా ఘోరా జ్ఞాతయస్తు భయావహాః. 2

[ఎప్పుడూ అమితమైన ప్రేమ వలకబోస్తూ, లోపల ఉన్నది పైకి కనబడనియని జ్ఞాతుల వల్ల చాలా ప్రమాదం.]

"నాగ్ని ర్నాన్యాని శస్త్రాణి, న నః పాశా భయావహాః,
ఘోరాః స్వార్థప్రయుక్తాస్తు జ్ఞాతయో నో భయావహాః,
ఉపాయ మేతే వక్ష్యంతి గ్రహణే, నాత్ర సంశయః,
కృత్స్నా ద్భయాత్ జ్ఞాతిభయం సుకష్టం విదితం వచః". 3

[అరణ్యంలో ఏనుగులు ఇలా చెప్పుకున్నాయట: "మనకు నిప్పు, ఇతర ఆయుధాలూ, పాశాలూ చూస్తే భయంలేదు; మనకున్న భయమల్లా మన జాతివాటినుంచే; అవే మనను పట్టటానికి తోడ్పడతాయి. అన్ని భయంకన్న కూడా జ్ఞాతుల వల్ల భయం ఎక్కువని అందరికీ తెలిసినదే."]

ప్రచ్ఛన్న శత్రువులు

Photo by K. P. A. Swamy



బహుమతి
పొందిన వ్యాఖ్య

తోచుపోని వేళ

పంపినవారు :
ఈ శ్రం కృష్ణ

Chandamama, June '76 Photo by Mohan D. Desai



నాగార్జున నగర్,
మద్రాసు-24

ఉత్తుత్తి ఆట

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు



★



★ వ్యాఖ్యలు జూన్ 20వ తేదీ లోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైన మాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు ఆగస్టు నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



Printed by B. V. REDDI at Prasad Process Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGI REDDI


మైసూర్ శాండల్ సబ్బు
మహత్తర భారతీయ పరంపర పోటీ
రంగులు వేసే పోటీ
16 సంవత్సరాలలోపు బాలబాలికలకు
మాత్రమే ప్రవేశము
(మే, 31, 1960 తర్వాత పుట్టి ఉండాలి)
పూర్తి వివరాలకు ఏ ప్రముఖ దుకాణం నుంచైనా
సరే ఎంట్రీ ఫారం తీసుకోండి. లేదా ఈ దిగువ
చిరునామాకు రాయండి :
మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్,
(సోప్స్ డివిజన్)
36, కన్నింగ్‌హాం రోడ్, బెంగుళూర్-560 052
రూ: 25,000 కన్న ఎక్కువ విలువగల బహుమతులు గెలవండి.
గెలుపొందిన వారి కుటుంబాలకు బోనస్‌గా తం బహుమతులు
MCA/MSIL/SS/54 tel
త్వరపడండి !
ముగింపు తేది పొడిగించ బడింది జూన్ 15,1976 వరకూ
మైసూర్ శాండల్
విశిష్టమైన స్నానపు సబ్బులలో గొప్ప భారతీయ సంప్రదాయము
గవర్నమెంట్ సోప్ ఫ్యాక్టరీ, బెంగుళూరు వారి విశిష్ట ఉత్పత్తి.
మార్కెట్ చేయువారు ⓜ మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగుళూర్.




# ఆనంద విమానంలో అద్భుత విహారం!

నోరూరించే, పెద్ద, డీలక్స్ మిఠాయిలతో! రుచిలోనేమి, పరిమళంలోనేమి, కొత్త కొత్త అనుభవతరంగాలలో ఓలలాడిస్తుంది న్యూట్రిన్ డీలక్స్.

NCM-59-75 TEL

nutrine

ఒక్కొక్క మిఠాయియందు
ఫలరసపూరితవిందు!

న్యూట్రిన్ కన్‌ఫెక్షనరి కంపెనీ లిమిటెడ్, పలమనేర్ రోడ్డ, చిత్తూరు, ఆం.ప్ర.

# ఒక్క ఓడోమాస్ మాత్రమే ఖచ్చితంగా దోమలబారినుండి 2 విధాలుగా కాపాడుతుంది...

## మీరు రాత్రంతా హాయిగా నిద్రపోయేందుకు తోడ్పడుతుంది.

ఓడోమాస్ మరే యితర దోమల నివారిణి
సమకూర్చని రీతిలో రక్షణ సమకూరుస్తుంది:

**1** 

దీని వాసన దోమలను దూరంగా ఉంచుతుంది.

**2** 

దీనిలోగల ప్రత్యేకమైన మూలపదార్థం దోమల బారి నుండి
మీ చర్మాన్ని కవచంగా కాపాడుతుంది...రాత్రంతా.

ఇక, ఓడోమాస్ భారతదేశంలో అత్యధికంగా
అమ్మబడుతున్న దోమల నివారిణి అంటే ఆశ్చర్య
మేముంటుంది మరి!

దోమల బాధకు గురికాకండి—

# ఓడోమాస్

**అందుబాటులో ఉంచుకోండి!**




మచ్ఛర్
కా
దుశ్మన్

ఇది
పసిపాపల మృదు
వైన చర్మానికి కూడా
నిరపాయకర
మైనది

బల్సారా
—సౌఖ్యమైన జీవనానికి
ఆధునాతన సాధనాలు
BALSARA

CHAITRA-BLS-86 TEL


alpana
ANNAPURNA
జగపతి ఫిలిమ్సు
దశావతారములు
ఈస్ట్మన్ కలర్
అనపూర్ణ విడుదల
నిర్మాత: వి. కృష్ణప్రసాద్
దర్శకత్వం: కె. ఎస్. గోపాలకృష్ణన్

# విజయ సాధక దశాబ్దం

## వ్యవసాయం

ఈ పదేండ్లలో రూపొందించిన పథకాల ఫలితంగా వ్యవసాయ విప్లవం ఏర్పడింది.
పెద్ద సాగునీటి ప్రాజెక్టులకు కమాండ్ ఏరియా కార్యక్రమం ఫలితంగా సాగునీటి సదుపాయాలు ఎక్కువయ్యాయి.

## పరిశ్రమ

లైసెన్సింగ్ పద్ధతిని ఉదారం చేశారు; ఇంకా సరళం చేశారు.
అనేక రంగాల్లో స్వయం సమృద్ధి సాధించాం.
ముడి పదార్థాలు ఇంకా సులభంగా లభ్యమవుతున్నాయి.
చిన్న పరిశ్రమలకు ఇంకా ఎక్కువ ప్రోత్సాహం ఏర్పడింది.

## కమ్యూనికేషన్లు

రైలు, రోడ్డు రవాణా మెరుగుపడింది.
రోడ్లు ఇంకా బాగుపడ్డాయి.
తంతి-తపాల సదుపాయాలు విస్తరించారు.
టెలిఫోను కనెక్షన్లు పెరిగాయి.

## సాంఘిక సేవలు

గ్రామీణ ఆరోగ్య పథకాలకు ప్రాముఖ్యం ఇస్తూ ఆరోగ్య-వైద్య సర్వీసులను సంఘటిత పరిచారు.
ఇంకా ఎక్కువగా డాక్టర్లు, నర్సులు ఉన్నారు; ఆస్పత్రి పడకలు ఎక్కువయ్యాయి.
చాల రాష్ట్రాల్లో హయ్యర్ సెకండరీ స్థాయివరకు ఉచిత విద్యకు ఏర్పాట్లు జరిగాయి.
మహిళలు, యువజనుల సంక్షేమానికి ప్రత్యేక అభివృద్ధి ప్రాజెక్టులను ప్రారంభించారు.




ఇది
కార్యసాధన
పూరిత
దశకం.

